నవయువకహృదయహారము ప్రథమకుసుమము

# ప్రేమ

(అశ్వినీకుమారదత్తు)

అనువాదకుఁడు :

వెలువోలు సీతారామయ్య



మాతృదేవి - శ్రీ బుల్లెమాంబ

# అంకితము

"నాస్తి మాతృసమం దైవమ్"
మహిత మహిమాన్వితమును సర్వోత్తమము నగు
మాతృపీఠ మధిష్ఠించిన
నిర్మలచరిత - కరుణామయి - పవిత్ర ప్రేమస్వరూపిణి
అస్మజ్జనని
శ్రీ బుల్లెమాంబా
పాద పంకేరుహములకు భక్తిపూర్వముగా
నీ ప్రేమకుసుమమును సమర్పించుచున్నాను.

— సీతారామయ్య

# రెండుమాటలు

ఈ ప్రేమ కుసుమమును శ్రీరామవృక్షశర్మా బేనీ పురీగారు వంగభాషోద్యానమునుండి సేకరించి, హిందీ భాషా ప్రపంచమున కర్పించిరి. దాని మనోజ్ఞ సౌర భాస్వాదనము మద్హృదయమును దన్మయ మొనరింప నాంధ్రలోకము నంతటిని ముఖ్యముగ నవయువకులను దత్సౌరభ మాఘ్రాణింపఁ జేయ నుంకించి, సహజ పరీ మళమున కెట్టి భంగము నొదవకుండునటుల నాశక్త్యను సారము భద్రపటిచి యీ తొలిపువ్వుతో నవయువక హృదయహార రచనకు దొడంగితి. యువకులు కోరఁదగిన నే తత్సౌరభ మాఘ్రాణించి సఫలతఁ గాంచ నోపిన — మత్పరిశ్రమకుఁ బ్రతిఫలమద్దియే— విబుధులిందుఁ గల మాధుర్యము నాస్వాదించి లోపముల నాదరపూర్వక ముగ మన్నింతురనియే నా విశ్వాసము.

ఈ నా కార్యమున సాయపడిన మిత్రులకును, అత్యధిక ప్రేమతో నుపక్రమణిక వ్రాసియొసంగిన కవిరాజు రామ స్వామి చౌదరిగారికిని నా ధన్యవాదములు.

శ్రీ భాషాసంజీవిని,
అమృతలూరు
౨౦-౧౧-౨౯

వెలువోలు సీతారామయ్య

# ఉపక్రమణిక

"ప్రేమ" యను గ్రంథమును నామూలాగ్రముగాఁ జదివితిని; శైలి ధారాళమయినది. భావములను విస్పష్టముగాఁ బ్రకటీకరించుటకుననువైనది. భాషాంతరీకరణమయినను, జదువరులకు నది తోఁపనీయకుండ చేయఁగల్గు శైలియలవడుటంజేసి, శ్రవణపేయముగా నున్నది; ప్రేమనుగూర్చి యింత యుద్గ్రంథమును వ్రాయఁగల్గిన "అశ్వినీకుమారదత్తు" ధన్యుఁడు. తద్గ్రంథమును భాషాంతరీకరణముఁ జేసిన యీ కవియు కృతార్థుఁడు. ప్రేమ భిన్నాశ్రయములచే భిన్ననామముల లోకమున వ్యవహరింపఁబడుచున్నది. భార్యయెడ భర్తచూపు ప్రేమ, యనురాగము; భర్తయెడ భార్యచూపు ప్రేమ, భక్తి; సంతానము నెడ తల్లి దండ్రులు చూపు ప్రేమ, వత్సలత; పురుషులుగాని, స్త్రీలుగాని యొకరియెడ నొకరుచూపు ప్రేమ, స్నేహము. కాని వీని కన్నింటికి పరమావధి యొక్కటియే. ప్రేమ యెన్నఁడు నిష్కామప్రేరితమగునో యది యుత్తమోత్తమము. స్వచ్ఛమైన ప్రేమ ప్రతిఫలమును వాంఛించునదికాదు. ఇట్టి ప్రేమయే కొందఱు ఋష్యాదులను, మతకర్తలనుగూడ ప్రేరేపించి, లోకోద్ధ

రణమునకుఁ బురికొల్పినది. భారతదేశ చరిత్రయందు నిట్టి ప్రేమరసైకలోలురు పెక్కురు పొడకట్టెదరు.

నిజమగుప్రేమ కలవాఁ డెన్ని యవరోధములు కల్గినను వొలిసారి ప్రేమించినవారిని, ప్రేమించుచునే యుండును. ఇట్టి యుత్కృష్టమైన ప్రేమ సహజము; అలవఱచికొనఁ బ్రయత్నించిన నలవడునది కాదు. ఇట్టి సర్వజనోపాస్య మగు ప్రేమ యొక్క తత్వము ప్రాకృతజనంబునకు సైతము బోధపడునట్లు తేటతెనుంగున నాంధ్రలోకంబు నకు సమర్పించిన కవి చిరస్మరణీయుఁడు. పాఠకు లేతత్కవితాసారభ్యమును— ఏతత్తత్వ రహస్యమును సాంగముగ గ్రహించి ధన్యులగుదురని కాంక్షించుచుంటి. ఇట్టి యుద్గ్రంథ రచనాకౌశలము కాలక్రమమున కవి స్వాధీనమయి యభివృద్ధి నొందుఁగాత.

తెనాలి
15-11-29

ఇట్లు
కవిరాజు
త్రిపురనేని రామస్వామి చౌదరి
బారిష్టరు.

*

"Love is God and God is Love"
"ఈశ్వరుఁడె ప్రేమ-ప్రేమయే యీశ్వరుండు"

# అశ్వినీకుమారదత్తు
## (జీవనచరిత్ర)

ఈ ఘోరకలియుగమున, నీ యిరువదవ శతాబ్దపు విషసంకలిత వాయుమండలమున, విలాస శరీరవాదముల కాతురతఁజూపు ఈ కాలమున, భీష్మపితామహునిరీతి నఖండ బ్రహ్మచర్యముతో జీవనముఁ గడపుట, ఉన్నత మగు 'యం. యే' డిగ్రీనొందియు లోకసేవకై స్వీయ తను మనంబు లర్పణసేయుట, పితృసంచితధనముసైతము జనసాధారణమునకై బలియొసంగుట, భయంకర రోగ పీడితుల మలమూత్రములఁ గూడఁ దనహస్తములతోఁ బరిశుభ్ర మొనరించుట, అస్పృశ్యులని భావింపఁబడు పాకీవారిని నత్యాసక్తితో నాలింగన మొనరించుకొనుట, సంభవమా? ఏమి, అటుల జరుగునా? మస్తిష్కము స్వీకరింపఁ జాలకపోయినను, మనస్సు సమ్మతింపక పోయినను, ఈ ఘటన యథార్థము. సూర్యచంద్రుల యునికివలె నిదియు యాథార్థ్యము. దీని నవశ్యము స్వీకరింపవలెను; సమ్మతింపవలెను.

ఉపర్యుక్తగుణంబులన్నియు నొండొంటితో సమ్మిశ్రితములై, మన యశ్వినీబాబు నాశ్రయించి యున్నవి.

నేఁడు వారు మన మధ్యనుండు భాగ్యమొదవకపోయి నను, "వారే నుడివినట్లు ఆనందస్వరూపము యొక్క-యానందాజ్ఞ నొంది యానందలోకమునుండి, యానంద లోకమున" కాకర్షింపఁబడినను, వారి పవిత్రస్మృతి, విశాలోదారచరితము, జనమనోముగ్ధతాకారి యగు జీవనము, నవయువకులను - దేశాభిమానులను, ప్రేమ పాఠమును బఠింపించి, భక్తిభవనమునఁ బ్రవేశింపఁజేసి, కర్మమర్మమును గ్రహింపఁజేసి, నీచమునుండి యుచ్చమున కు, నుచ్చమునుండి యుచ్చతరమునకు, నుచ్చతరము నుండి యుచ్చతమమునకుఁ జేర్పఁగలవు.

వారు విద్యార్థిలోకమున కాప్తమిత్రులు. నవయువకుల కనుపమపరిపోషకులు. వారు జీవితమంతయు విద్యార్థులమధ్యనే కడపిరి. వారి జీవనకాలమంతయు నవయువకపరివేష్టితముగనే తుదముట్టెను. అందుచే దేశీయులగు నవయువకుల కందఱకు వారి విషయమై యెఱుంగుట, వారి జీవనచరితను గ్రహించుట, వారి గ్రంథముల నధ్యయనమొనరించుట, వారి నాదర్శముగా భావించి తమ జీవన నిర్మాణమునకుఁ గడంగుట యత్యంతావశ్యకము.

వారు వంగదేశీయులు. 'బారిసాల' మండలమున 'పటుఆఖాలీ' యను పల్లెగ్రామమున, క్రీ. శ. ౧౮౫౬ వ

సం.న జన్మించిరి. వారి జనకుఁడు విద్యానురాగి యగు వ్రజమోహానదత్తు. జననియు నత్యంత ధర్మనిష్ఠగల యుదారచరిత. మాతాపితృ ప్రభావమంతయు వారి శీల నిర్మాణముపైఁ బ్రసరించెను. బాల్యమునుండియె వారు ధర్మప్రవర్తనులు.

విద్యాసముపార్జనమున వారు సూక్ష్మగ్రాహులు. పరీక్షలయం దుత్తీర్ణులగుటకై పుస్తకములను గీరముకీతి వల్లించుటన వారికి గిట్టదు. పాఠ్యవిషయముల విమర్శన పూర్వకముగ నధ్యయన 'మొ న రి ం చు ట యే వారి యాప్సితము. తత్ఫలితముగఁ బదుమూఁడు వత్సరముల బాల్యావస్థయందే వారు ప్రవేశపరీక్షయం దుత్తీర్ణులైరి. అల్పప్రాయముకతన 'బి. యే.' పరీక్షయం దుత్తీర్ణు లగుటకు విశ్వవిద్యాలయ నియమానుసారము కొంతకాలము నిలువవలసివచ్చెను. అయినను 'రేవల మిఱువదినాల్గు వర్షముల ప్రాయముననే వారు 'యం. యే., బి. యల్.' డిగ్రీలను సంపాదింపఁగల్గిరి.

లా చదివిన తదుపరి కొన్ని దినములు న్యాయవాద వృత్తియందుండిరి. కాని యా వృత్తియందు వారికి మోస ములు, నసత్యములు ప్రాబల్యము వహించుట కాన్పిం చెను. ఆ యదనుననే సర్కారువారు డిప్యూటీ మేజస్ట్రేటు

పదవి నొసంగఁగోరిరి. కాని స్వాతంత్ర్య ప్రియుఁడగు వారి తండ్రి తన బుద్ధికుశలతగల ముద్దుపుత్రుని దాస్య జాలమునఁ జిక్కువడఁజేయుట యనుచితమని భావించెను.

పసితనమునుండియు వారు ప్రేమారాధకులు, ప్రపూర్ణ సౌందర్యోపాసకులుకూడను. కాని వారి ప్రేమ, వారి సౌందర్యోపాసన పరిచయమొనరించుకొనఁ గోరినచో నీ పుస్తకము నామూలాగ్రముగాఁ బఠించుటయే కర్తవ్యము.

యువకులకు వారేకాంతమిత్రులు. విద్యార్థులపైనే దేశోన్నతి యాధారపడి యున్నదని భావించి వారు, బారిసాలునఁ దన జనకుని నామముతో 'వ్రజమోహన విద్యాలయము' అను నొక కళాశాలను స్థాపించెను. ఈ విద్యాలయముద్వారా యువకుల నేకత్రితమొనరించుటకై వారి సమస్త జీవితమును గడపెను. ఈ విద్యాలయము కేవలము బాలురఁ బరీక్షలలో నుత్తీర్ణులఁ జేయు యంత్రము మాత్రము కాదు. బాలకుల నైతి కాధ్యాత్మిక మానసిక శారీరక వికాసములే ప్రధా నోద్దేశ్యములుగా నుంచఁబడెను. ఇందలి బోధకు లంద ఱును నల్పవేతన పరితృప్త మానసులును స్వావలంబ కులును.

ఈ విద్యాలయమునకై వారు లక్షలకొలఁది రూప్యములు వెచ్చించియుండిరి. సర్కారువారు పెక్కుసారులు సాహాయ్య మొనరింప నుంకించినను వా రందుల కియ్యకొనరైరి. ఒకతూరి సర్కారువా రీ విద్యాలయమునం దేమైనఁ గుట్రజరుగుచున్న దేమో యని సందేహించి యిద్దఱు ప్రముఖుల దాని యాంతరికదశానిరీక్షణమునకై నియోగించిరి. అం దొకరు దీనిఁ బరీక్షించి సుప్రసన్నులై "వ్రజమోహన విద్యాలయము వంటి యుత్కృష్ట విద్యాలయముండినను గూడ నిచ్చటి విద్యార్థులు కేంబ్రిడ్జి, ఆక్సుఫర్డు విద్యాలయముల కరుగు టేలనో గ్రహింపఁ జాలకున్నాను" అని లిఖించిరి.

అన్నిటికంటె మిన్నయగు విషయ మేమన వారాజన్మబ్రహ్మచారులు – వివాహామే చేసికొనలేదు. ఆహా! జీవన సర్వస్వమును దేశమున కర్పణచేసిన మహనీయునకుఁ బరిణయచూఁపుటకుఁ దా వెచ్చట! వారి చరిత్ర మత్యుజ్జ్వలము. దానియం దెచ్చటను జిన్న మచ్చనుగూడఁ జూడఁజాలము. వారు నిర్మల చరితులై యుండికూడ దుశ్చరితుల సహావాసమున కించుకేనియు జంకెడివారు కారు. కారణము వారికి పాపులపై ననాదరణ లేదు. పాపముపైనే యనాదరణ. ఎందఱో పాపులు,

దుశ్చరితులు వారి సంసర్గముచే సదాచారులుగను, ధార్మికులుగను సంస్కరింపఁబడిరి.

పిల్లలయెడ వారికిఁ బ్రేమ మెండు. ఎల్లపుడు వారితోడనే హాసవిలాసములఁ గాలముఁ గడపెడివారు. బి.యే. పరీక్షానంతర మొక పాఠశాలయందుఁ బ్రధానోపాధ్యాయులుగా నున్నతఱిఁగూడ విద్యార్థులతో నడవుల భ్రిమ్మరుచు, నావలపై సముద్రవిహారము సల్పుచు సంతసమున నోలలాడెడివారు. ఇందుల కొకరు "మహాశయూ! తమ రీ విధముగ బాలురతోఁ గ్రీడావినోదములు సల్పుచుంట భావ్యమా?" అని ప్రశ్నించిరి. "నేను బాలుర చరిత్రలయం దేవిధమైన పాపస్పర్శయు సోఁకకుండునటు లొనరించుటకే వారితోఁ గలసిమెలసి సంచరించుచుంటిని. పరిశుద్ధమగు నామోదమార్గమును బరిత్యజించినచో బాలురు కుసంసర్గమునఁ జిక్కువడి తమ జీవితముల నష్టమొనరించుకొందురు." అని వారు వెంటనే ప్రత్యుత్తర మొసంగిరి.

వారి జీవనముయొక్క ముఖ్యలక్ష్యము బాలకయువకులే. వాస్తవముగా వారు నవయువకులకు నీశ్వరప్రేషితాచార్యులు. (Born Teacher of Youths). విద్యార్థుల వలననే వారి యశఃప్రభావములు వంగదేశముననేకాక భారతదేశమునందంతటను వ్యాపించెను.

సాక్షాత్తుగ వారు సేవావతారము. కలరా రోగుల మలమూత్రములు సైతము వారి హస్తములతోఁ బరిశుభ్రముచేసియుండిరి. పెక్కుసారులు స్వీయప్రాణాపాయస్థితియందుఁగూడ నసహాయులకు సేవసల్పియుండిరి. వంగదేశమున వఱదలవలనను గాటకములవలనను గష్టములు సంభవిల్లు ప్రదేశములన్నింటికిఁ దమ యనుచర వర్గముతోఁ జేరి సాహాయ్యపడువారు. వీరి జీవనమంతయు విశ్వప్రేమతో నిండి నిబిడీకృతమైయుండెను. అస్పృశ్యులును – పాకీవారునుగూడ వారి ప్రేమకుఁ బాత్రులైరి. ఒకతూరి తన మరుగుదొడ్డి బాగుచేయు "గులాబ్" అను పాకీవానిని గాఢాలింగనమొనరించుకొనెను.

వారు సౌందర్యోపాసకులైనను నాడంబరమునకు మాత్రము దూరవర్తులు. ఎల్లపుడు సామాన్యమగు దుస్తులనే ధరించెడివారు. ఒకతూరి వారొకవిద్యార్థిని సర్వదా డాంబిక వేషధారియై వచ్చుచుంటచేఁ గళాశాల నుండి వెడలనడపిరి. కొన్నివత్సరముల పిదప నా విద్యార్థి తిరిగి సమావేశమై వారికిఁ గృతజ్ఞతాభివాదనము లొసంగెను. వాఁడు నాఁటినుండియుఁ దన యాడంబరము నంతయు విసర్జించెను.

వారి సేవాప్రభావము సామాన్య ప్రజలఁగూడ నాకర్షింపఁగలిగెను. బారిసాల ప్రజలు వారిని సాక్షాద్దేవతగా భావించెడివారు. ఔషధ సేవనముచే స్వస్థము పొందలేని రోగులు వారి పాదధూళి సోఁకినంతనే యారోగ్యవంతులగుటగూడఁ గలదని ప్రతీతి. ఒకనాఁడొక పల్లెటూరి ముదుసలి వారికొక పనస పండును గానుకగా నొసంగెను. అతనిఁ గారణమడుగఁ దనపనస చెట్టెంతకాలమునకును ఫలింపమి 'నీ చెట్టు ఫలించిన మొదటి ఫల మశ్వినీ బాబున కుపహార మొసంగెదనని మనసున నిశ్చయించుకొంటి' నని వచించెను. ధన్యుఁడు!! గాంధీమహాత్ముఁడు వంగదేశమున కేతెంచిన పుడు స్వయముగ వీరి గృహమున కేగి వీరితో ముచ్చటించెను.

ఆజన్మబ్రహ్మచారిగానుండుట కతనను, విశేషించి సంయమ నియమములఁ బాటించుట చేతను, గఠిన పరిశ్రమ ఫలితముగను వారికి బహుమూత్ర రోగ మంకురించెను. ఈ దారుణవ్యాధిచే వారి స్వాస్థ్యమునకు భంగ మొదవెను. చికిత్స నొందుటకై కలకత్తా కేతెంచిరి. కాని క్రీ. శ. ౧౯౨౩ నవంబరు మాసమున వారు ప్రేమ లోకము నలంకరించిరి. అప్పటికి వారి కఱువదియేడు వర్షముల ప్రాయము.

వ్రజమోహన విద్యాలయమున నే 'బాంధవ సమితి' (మిత్రమండలి) యను నవయువక సభ, యొకటి కలదు. దాని పతాకపై, సత్యము, ప్రేమ, పవిత్రత యను మూలమంత్రములు లిఖింపఁబడెను. తత్సభాసమావేశము ప్రతి శనివారము సంధ్యాసమయమున జరుగుచుండును. ఆ సమావేశములలో నేదో యొక విశ్వవ్యాపక విషయ ముపై, నియమితరూపమున నుపన్యాసములు జరుగు చుండెడివి. ఈ 'ప్రేమ' ఆ సభయందొసంగఁబడిన యశ్వినీబాబుయొక్క వ్యాఖ్యానమాల.

---

జాకో లహి కభు లహాన కీ
చాహ నహియ మే హాయ
జయతి జగత పావన కరన
"ప్రేమ"బరన యహ దోయ

— భారతేందు హరిశ్చంద్ర

ఎయ్యది లభింప వేరొక్క టెసఁగవలయు
ననెడి యాకాంక్ష దూరమై చనునొ యట్టి
పరమ పావనకరమయి ప్రబలు ద్వంద్వ
వర్ణయుత "ప్రేమ" ధన్యమై వఱలుగాత.

# ప్రేమ

## ప్రస్తావన

బాంధవసమితి పతాకపై ముద్రితమైన మంత్రము లోని రెండవ శబ్దమును గుఱించి కొంత ముచ్చటింతును. యువకులకుఁ బ్రేమసంబంధమై బోధించుటెంతయు నావశ్యకము. నేఁడు వీధులలో 'ప్రేమ'యను పేరితో సైతాను సర్వనాశన మొనరించు కామమోహాదుల విక్రయించు చున్నాఁడు. పాపము, అమాయికులగు యువకులు వానిఁ బరిగ్రహించుచున్నారు. ఇందుచే యువకుల సావధానులనుగా నొనరించుట కొఱకే యీ విషయమై ప్రస్తావింప వలసి వచ్చినది.

సత్యప్రేమ జగత్తుయొక్క సారము—అమూల్య పదార్థము. అది పృథ్విని గూడ స్వర్గతుల్య మొనరించుటకై స్వర్గమునుండి ప్రేరేపితమగుచున్నది. స్వయముగఁ బ్రేమ స్వరూపుఁడగు పరమాత్మయే దానిని బ్రేరణ చేయుచున్నాఁడు. మనుష్య ప్రయత్నములచే నది లభ్యమగునది కాదు. వీధులయందు విక్రయింపఁబడదు. దివ్య

ధామముయొక్క సామగ్రి దివ్యధామమునుండియే ప్రేరితమై మనుజులను దివ్యధామమునకుఁ జేర్చుచున్నది.

ఈ పృథ్వి కాధారము ప్రేమయే. వాయువు వీచుట, మేఘములు వర్షించుట, సస్యములు ఫలించుట దాని కతననే. అదియే మనకందఱకు నాహారము. నీవు, నేను, అందఱమును దాని రక్షణక్రిందనే వసించుచున్నారము. కాని యదెద్దియో గ్రహింపఁజాలకున్నారము. గ్రహించుటకూడఁ గష్టసాధ్యమే. ఎవరిచరణతలమునుండి పతితపావనియుఁ బ్రేమ ప్రపూరితయు నగు గంగ యుత్పన్నమయినదో వారి విషయమై యెఱుంగకయే, ప్రేమ రహస్యము గ్రహింపఁ గల్గుట సంభవమా ?

భగవానుని యందనురాగము లేనిచోటఁ బ్రేమ నిలువఁజాలదు. దానికి మూలాధారము భగవానుఁడే. యువకులారా ! అనుసంధానమొనరించి విలోకింపుఁడు, మీ ప్రేమవృక్షమూలమున,-పునాదియందు భగవంతుఁడున్నాఁడా, లేఁడా? ఎవరిని మీరు ప్రేమించుచుంటిరో వారితోఁగూడ భగవంతునిగుఱించియు, వారి కర్తవ్యసంబంధమును గుఱించియు ముచ్చటించుట కిచ్ఛవొడముచున్నదా, లేదా ? పవిత్రతా సముపార్జనమునకై పరస్పర సాహాయ్య మొనరించుకొనుచుంటిరా, లేరా ?

పవిత్రతలేనిచోటఁ బ్రేమలేదు. ప్రేమస్వరూపము యొక్క సత్త పవిత్రతామయము. ఇందుచేఁ బవిత్రత లేక ప్రేమ సంభవిలఁజాలదు. పృథ్వీసంబంధమగు నెట్టి కళంక మాపాదిల్లినను ఆ ప్రేమఁ బ్రేమయని చెప్పఁజనదు.

నేఁడు తఱచుగా యువకులు కళంక ప్రపూరిత మోహ కామముల కాశ్రయ మొసంగి వానినే ప్రేమ యని పిలుచుచుండుట వినుచున్నారము. సైతాను యొక్క మాయకు లొంగియే వారటు లొనరించుట. చెడ్డను గప్పిపుచ్చి మంచి యని మోసపుచ్చుటయే వాని కర్తవ్యము. ప్రేమ యను పేరుతో - దాంపత్యప్రేమ, బంధుత్వ భ్రాతృ స్నేహాది వివిధ సుందర నామములొసంగి వాఁడు కామ మోహములఁ బ్రవేశపెట్టుచున్నాఁడు. మూర్ఖులగు యువకు లజ్ఞానవశమున వాని నాహ్లాదనముతో నానంద ప్రపూర్ణులై గ్రహించుచున్నారు.

మంచి వస్తువునకుఁ జెడ్డవస్తువునకు భేదమేమియో మీకుఁ దెలియఁజెప్పుట నా కర్తవ్యము. మంచివస్తువునఁ బ్రేమరాజ్యాధిపతియుఁ బ్రేమస్వరూపుఁడు నగు పరమాత్మయొక్క చిహ్న మంకితమై యుండును. దేని యందా చిహ్నముఁ గానరో సావధానముగనుండి దాని నెప్పుడును స్వీకరింపవలదు. స్వర్గముయొక్క ప్రతి పదా

ర్థమునందును ఈశ్వరుని నామము సువర్ణాక్షరములతోఁ బ్రజ్వరిలుచుండును. కాని ధూర్తుఁ డగు సైతాను దానిని గూడ ననుకరించుచున్నాఁడు. పవిత్రత యను పేరుతో నపవిత్రత నెదుటఁ బెట్టుచున్నాఁడు. కాని జాగ్రత్తతో నొక్కతూరి తీక్ష్ణదృష్టిని బ్రసరింపఁజేసి నిరీక్షించినచో నా కళంకము లెస్సగా దృష్టిగోచరమగును. ఈ కళంకమే క్రమోన్నతినొంది సమస్తజీవనము నాక్రమించి తుదకు సాదరమున స్వీకరించి నిలిపినట్టి యాశ్రయమునుగూడ నాశన మొనరించుచున్నది. మీ జీవిత రక్షణమునకై బాగుగ ననేక పరివర్తనముల నొంది మీ ప్రేమయం దీ కళంక మెచ్చటనైన మఱుగువడి యున్నదేమో యని పరిశీలించుట మీలో నెల్లరకు ముఖ్యకర్తవ్యము. కళంకము దృష్టిగోచరమగుచో మిమ్ముల సైతాను మోస గించినాఁ డని గ్రహింపుఁడు. చాలు, వెంటనే గగ్గోలు పెట్టుఁడు– సర్వనాశనము! అత్యంతకాతర స్వరముతో నా ప్రేమ రాజ్యాధిపతి సమీపమునఁ బ్రార్థింపుఁడు — ఓ పరమాత్మా! రక్షింపుము, రక్షింపుము!! ఈ పాప సంకలిత ప్రేమను దూర మొనరింపుము. మీ పవిత్రతాంకితమగు సత్యప్రేమ నొసంగి యీ దాసుని గృతార్థునిగాఁ జేయుము!!!

ఇటులఁ బ్రార్థించినంతనే సైతానువస్తువులన్నియు నాశనమగును. సత్యప్రేమ ప్రాప్తించును. మనఃప్రాణములు శాంతిలును. జీవనము ధన్యతఁ జెందును.

నీ వెవనిఁ బ్రేమించుచుంటివో వాని నొకతూరి ధ్యానపూర్వకముగా విలోకింపుము. వాని ముఖమును దేటిపాటఁ జూచినంతనే నీకు భగవంతుఁడు స్మరణకు వచ్చుచున్నాఁడా, లేఁడా? మీకు నేను బ్రేమయొక్క లక్షణములను, దత్సాధనోపాయములను గ్రమముగాఁ దెలియఁ జెప్పెద. ప్రకృతము ప్రేమసంబంధమై సర్వదా యాత్మపరీక్షకుఁ గడంగుఁడని వచించుటయే నా కర్తవ్యము. నీ ప్రియుఁడు నీ యాత్మసంయమమును నష్టమొనరించుచున్నాఁడా? కర్తవ్యకర్మ మొనరించు నభిలాషను దగ్గింపఁ జేయుచున్నాఁడా? వాని సంయోగ వియోగములచేఁ బ్రాణము విశేషించి చలించుచున్నదా? వానితో నస్థిరామోద మనుభవించుట కిచ్ఛ వొడముచున్నదా? నిన్నుఁ బ్రేమించువాఁడే యన్యులఁగూడఁ బ్రేమించుచున్నచో నీ మనసున నసూయ గలుగుచున్నదా? ఆత్మసంయమమును నష్టమొనరించుచున్నచో, కర్తవ్య కర్మమున కడ్డుతగిలినచో, నస్థిరామోద మనుభవించుట కభిలషించినచో, నసూయ వొడమినచో నిది కళంక కలిత

ప్రేమయేకాని యథార్థప్రేమ కాదని యెఱుంగుము. ఆ కళంకమును దూరమొనరింపఁ బ్రయత్నింపుము. నిన్ను నీవే నియమములచే బంధించుకొనుము.

ఉపసంహారమున మరల మీకు నుడువుచున్నాను — ఏ ప్రేమయం దాదినుండి యంతమువఱకుఁ బ్రత్యంగము నందును బవిత్రత నిండి నిబిడీకృతమైయుండదో యది ప్రేమ కాఁజాలదు. అది యొక చిల్లిగవ్వకుఁగూడఁ గొఱ గాదు. అపవిత్రప్రేమకు హృదయమున స్థానమొసంగుట కంటెఁ బ్రేమశూన్యుఁడై యుంటయే యుత్తమము. ఈ మోహమదిరను బానమొనరించి యువకు లనేకులు చరిత్రభ్రష్టులైపోయిరి; శ్రేణియం దుత్తమ విద్యార్థిగా భావింపఁబడు వాఁడొకఁడు క్రమక్రమముగా మంద మతియై తుదకు నాశనమైపోయెను. అస్థిరామోద మనుభ వించుట కెవ్వని ప్రాణ మువ్విళ్లూరుచుండునో వానికి గంభీర విషయాలోచనాశక్తి తఱిగిపోవును; మస్తిష్కము దుర్బలమైపోవును; అంతమున జీవితమంతయు శక్తివిహీ నుఁడై గడుపవలసివచ్చును. ఈ ర్ష్యాగ్నియందు దగ్ధుఁడై తన శరీరమనంబుల నిరుపయోగ మొనరించుకొనినవాఁడు కూడఁగలఁడు. బీజ మంకురించెను, క్రమముగా నొకటి రెండాకులు కాన్పించెను, ఇది పెద్దవృక్షమగుననియు,

వందలకొలఁది ప్రాణులు దీని ఛాయాతలమున విశ్రమించి సుఖింతురనియుఁ దోఁటమాలి మిక్కిలి సంతసిలెను. రెండుదినములు గడచెనో లేదో దానియందొక కీటకము ప్రవేశించెను. చూచుచుండఁగనే యాకుల రాల్చెను. పాప మా లేతమొక్క శాశ్వతముగ శుష్కించి పోయెను. దైనందినోన్నతిచే విలసిల్లునట్టియు, శారీరక మానసిక నైతిక బలసుందర వికాససముపేతుఁడైనట్టియు, బాలకుని ప్రతిభను వీక్షించి ప్రజ లెంతెంతగనో యాశాసౌధముల నిర్మింతురు. ఈ బాలకుని చరణతలమున వేలకొలఁది సంసార సంతప్త జీవు లాశ్రయించి సుఖింతురనియు, వీనివలనఁ బ్రపంచ సౌభాగ్య మొదవుననియుఁ గాంక్షింతురు. కాని యే దుర్ముహూర్తమునందో యా బాలకుని హృదయకుహరమున నీ మోహ కామరూప మహాకీటకము ప్రవేశించెనా క్రమక్రమముగ నతని ప్రతిభయంతయు, రాహుగ్రస్తచంద్రుని భాతి కళావిహీనమైపోవును; వాని కష్టసహన సాహసోత్సాహ శక్తులన్నియు సమసిపోవును; వాని యభ్యున్నతి యవనతిగాఁ బరిణమించును. ఆశలన్నియు నడుగంటును. తుదకు వాఁడు జీవచ్ఛవమైపోవును.

మీలో నెవ్వనికి నిట్టిదశ సంప్రాప్తింపకుండుఁగాత! ఎవ్వఁడును గామమోహ శృంఖలాబద్ధుఁడై మృత్యు ముఖమునఁ బడకుండుఁగాత. ఇందులకే, ప్రేమకై మున్ముం దాత్మపరీక్షకుఁ గడంగుఁడనియే నేను మాటి మాటికి వచించుచున్నాను.

పరిశుద్ధమును, పవిత్రమును, భగవదనుమోదితము నగు ప్రేమను గుర్తింపుఁడు. దానిచే జీవిత సాఫల్య మొదవును. భగవానుఁడు మీకు సహాయుఁడగుఁగాత!

---

అనిర్వచనీయం ప్రేమస్వరూపమ్ ।
తథైవ—
మూకాస్వాదనవత్ ।
—నారద భక్తిసూత్ర.

# ప్రేమ లక్షణములు

## (ప్రేమ గీతము)

అతులితంబు నగాధమై యలరు ప్రేమ
సాగరజలంబునందు నే సంతసమున
మునుకలిడి సర్వపరితాపములుఁ దొలంగ
స్నానమొనరింతు—నహహా !! యాచంచలతపః·
మోహనోర్మికా స్పర్శానుభూతికలన
జీవమానంద రాజ్యాభిషిక్తమగును
మనసు ప్రేమకౌతూహలోన్మత్త మగును
సర్వవిధ పరిజ్ఞానంబు సమసిపోవు
నమల ప్రేమార్ణవ నిమజ్జనానుభవము
నింతయని వర్ణనముసేయ నెవ్వఁడోపు.

*　　*　　*　　*

దివ్యవార్నిధి మీనమై తేజరిలుచు
దానియంతస్థ్సలంబున దాఁగియుండి
యా వినూతనోత్సాహదాయక మనోజ్ఞ
ప్రవిమల ప్రేమ సింధు సంబంధి నౌదు

*　　*　　*　　*

సారరహితసంసార మపారమగుచు
సర్వవేళల, మరుభూమిసదృశ మగుచు
నలరుచుండె, నియ్యది వాసనాన్వితంబు
ప్రణయ సుమవల్లి నిచ్చుటం బడయఁజాల
నెందులకు నుందునిట ? ఏమి పొందువాఁడ !
ఆ వినూతనోత్సాహదాయక మనోజ్ఞ
ప్రవిమల ప్రేమ సింధు సంబంధి నగుచు
నందె మునుఁగుచుఁ దేలుచు నలరువాఁడ.

ఓ ప్రేమాభిలాషులగు యువకులారా! ప్రేమించుట యభ్యసింపఁగోరినచో ఆ ప్రేమసాగరముయొక్క జలమును పానమొనరింపుఁడు. ప్రేమ యన నేమియో గ్రహించుటకై యా జలమును ద్రాగవలెను – ఆ జలమున స్నానమొనరింపవలెను – తేలియాడవలెను – క్రుంకులిడవలెను. ఆ సాగరమున వినా యన్యస్థానములఁ బ్రేమ లభింపఁజాలదు. అందే క్రుంకులిడుఁడు – దుముకుఁడు, ఆ జలమునే పానమొనరింపుఁడు. అందు నెవఁ డెంతగా నిమగ్నుఁడగునో యంతమాత్రమే ప్రేమతత్త్వమును గ్రహింపఁగలఁడు–అంతమాత్రమే ప్రేమరత్నముల సంగ్రహింపఁగలఁడు. ఆ స్థానమునువిడిచి యన్యస్థానముల యం దెచ్చటను బ్రేమ వసింపదు. సత్యప్రేమకు వాస

మిదియే. వీధులయందుఁ జూచునది ప్రేమ కాదు. ప్రేమ కనికిప కెవరో, యెచ్చటినుండి ప్రేమ బయల్వెడలు చున్నదో, వారి సమీపమునఁ బ్రేమను స్వీకరింపుఁడు; వారి చరణతలమున భిక్షుకులరై నిలువుఁడు; "ప్రేమ భిక్షఁ బెట్టుఁడు, ప్రేమభిక్షఁ బెట్టుఁడు" అని వారి ద్వార సీమను గేకలిడుఁడు. వారు దయఁదలఁచి ప్రేమ నొసంగి నచో అప్పుడే మీరు ప్రేమను బొందఁగలరు. ప్రపంచ మునఁ బ్రేమ యను పేరుతోఁ గామమోహములు విక్ర యింపఁబడుచున్నవి. పరిశుద్ధ ప్రేమ ప్రాప్తిచేతనే కామ మోహములు దూరమగును. పవిత్ర ప్రేమ ప్రాప్తికై ప్రేమ సింధువున మగ్నులు కావలెను. ఆ జలము మీ శరీరముల స్పృశించినంతనే మీకు నలువైపులఁ బ్రేమయే దృష్టి గోచరమగును — చాలు; సర్వము ప్రేమమయమే, స్వర్గమునఁ బ్రేమ, మర్త్యమునఁ బ్రేమ, గగనమునఁ బ్రేమ,—అంతటను బ్రేమయే. ప్రేమ యెచ్చట లేదు ?

యథార్థప్రేమ స్వర్గమునుండి ప్రేరితమగుచున్నదని ప్రథమముననే వచించియుంటిని. అది స్వర్గముయొక్క వస్తువు. దానిపై స్వర్గముయొక్క ముద్ర వేయఁబడి యున్నది. ఆ ముద్రపై నేమి లిఖింపఁబడియుండునో, ప్రేమ లక్షణము లెవ్వియో ఇప్పుడు తెలియఁజెప్పెద.

ప్రేమయం దీ భావము లంకితములై యుండుట విలో కెంతుము — ౧. ఆనందము ౨. నవీనత ౩. నిత్యత ౪. ఉచ్చత ౫. వ్యాపకత ౬. స్వార్థహీనత - ప్రేమ యందు మధుర రసాస్వాదము గొప్ప యానందము. ప్రేమ యానందమునఁ దేలియాడుచుండును. ప్రేమ స్వరూపుఁడే యానందస్వరూపుఁడు. వాఁడే రసస్వరూపుఁడు. ఇందుచేఁ బ్రేమయం దఖండానందము గలదు. ఆ యానందమునకు శేషములేదు — విరామములేదు. ఎవనిని బ్రేమించుచుంటివో వాని నిరీక్షించినంత నే యానందతరంగములు వినోదక్రీడల సలుప సాఁగును, వానిని స్మరించినమాత్రముననే మనసునం దానందము వ్యాప్తమగును ; ప్రాణము లానందపరిపూర్ణము లగును. పెక్కుమాట లేల! ప్రేమాస్పదుఁడే యానందమూర్తి. ప్రేమియొక్క హృదయము సర్వదా యానందకలితమై యుండును. వానికి సుఖదుఃఖములు రెంటియందు నానందమే లభించుచున్నది. దుఃఖప్రపూర్ణ హృదయముపైఁ బ్రేమాస్పదుఁడు నిలిచెనా, సర్వదుఃఖములు నమసి పోవును. ఎవఁడు ప్రేమాధిష్ఠాతయొక్క సమీపమునుండి ప్రేమను స్వీకరించెనో వానికి మృత్యువునందుఁ గూడ నానందమే లభించును. కాకేమి! ప్రేమస్వరూపుఁడే

మృత్యువిధాత – ఆనందస్వరూపుఁడు – "ఆనందాద్ధ్యేవ, ఖల్విమాని భూతాని జాయంతే, ఆనందేన, జాతాని, జీవన్తి, ఆనందం, ప్రయన్త్యభిసంవిశంతి". ఆనందము నుండియే యీ సమస్త జీవరాసు, లుద్భూతములగుచున్నవి. ఆనందావలంబనము వలననే జీవించుచున్నవి. మరణానంతర మానందముననే యైక్యమగుచున్నవి. కేవలము మృత్యువు ప్రేమయొక్క లీల, ప్రేమయొక్క ఖేలనము. నేను మరణించుచున్నాను — ఆనందముతో నానందమువైపున, కరుగుచున్నాను. నా ప్రియుఁడు మరణించుచున్నాఁడు — ప్రేమ స్వరూపుని ప్రేమాజ్ఞ నొంది యానందముతో నానందలోకమున కరుగుచున్నాఁడు. మఱి దుఃఖించు టేల? ఇచ్చట నానందమును విడిచి యన్యచర్చలు మన కనవసరము. ఆనందము! ఆనందము! విపత్తున, దుఃఖమున, మృత్యువున నానందానుభవము లభింపనిచో నింకను బ్రేమ యుత్పన్నము కాలేదని గ్రహింపుఁడు. విపత్తున నానందము లభించినపుడే ప్రేమోత్పత్తి గల్గును. ఎట్టి దుఃఖముచేనైనను బ్రేమి యుద్విగ్నుఁడు కాఁజాలఁడు. ప్రేమానంద ప్రవాహము వాని హృదయమును బరిప్లావితమొనరించి ప్రవహించుచున్నది. అందుచే సర్వదుఃఖములు నుపశమించు

చున్నవి. గృహమున నన్నములేనప్పటికిని బ్రేమప్రపూరితుఁ డెప్పుడును విరక్తుఁడు కాఁజాలఁడు. సుఖదుఃఖములు రెండును బ్రేమ స్వరూపమునందే విలీనములై యుండెనని వాఁ డెఱుంగును. ప్రేమి, ప్రియుఁడు-వీ రిరువుర విషయమై లోకులెంతగాఁ జెప్పుకొనినను, నలుదిక్కుల వీరి నిందింప సాగినను బ్రేమిమనంబున ఖేద మిసుమంతయు నుండఁజాలదు. "నీ యందును నాయందును బంధుత్వము స్థాపింపఁబడినది. ఈ విషయమై లోకు లెందఱో నిందించుచుండిరి. ఎవరి యిచ్ఛానుసారము వారు వచింతురుగాత. కాని నీవును నేనును దివ్యకార్యమునే యొనరించితిమి" అని ప్రియునితోఁ జివఱకుఁ జెప్పఁ గలుగుచున్నాఁడు. భగవంతుని లక్ష్యమునందుంచి యొక ప్రేమి యీ మాటల వచించె. ప్రత్యేకము పవిత్రుఁడగు ప్రేమాస్పదుని లక్ష్యమునం దుంచుకొని యిటుల వచింపఁ గల్గుచున్నాఁడు. కష్టమున, విపత్తున, శోకమున, దుఃఖమున - నేను, నా ప్రేమాస్పదుఁడు భగవంతుని యొడియందు నిగూఢముగ విశ్రమించి యున్నారమని ప్రేమి మనసున భావించి యానందాతిరేకమున గ్రీడించుచున్నాఁడు. విపత్తెంత యాధిక్యము నొందునో యానందము నంతియే యభివృద్ధిఁ జెందును.

ప్రేమి మయూరసదృశుఁడు; మేఘనాశనము వీక్షించి నెమలి యానంద విహ్వలతఁ జెంది యత్యధికముగ నృత్యము సలుపసాగును. విపత్తుననే ప్రేమకు విశేష వికాసము కల్గుచున్నది. నీవు నన్ను ప్రేమించుచుంటివో లేదో కనుఁగొనుట విపత్సమయమునఁగాక యన్య సమయముల దుర్లభము. మఱియు నేను నినుఁ బ్రేమించు చుంటినో లేదో పరీక్షించుటకును, నీ విపత్సమయమే తగిన యదను. క్రీస్తుమహానీయుఁ డురికంబముపై నెక్కినపుడు ప్రదర్శించినట్టి పవిత్రప్రేమ వారి జీవితకాలమునం దెప్పుడును లభించియుండలేదు. ఇందు చేతనే వారు మరణసమయమునఁగూడ స్థైర్యముతో నిలువఁగలిగిరి. ప్రహ్లాద కుమారుఁడు భగవంతుని బ్రేమించుటచేతనే కదా, యేనుఁగుచేఁ ద్రొక్కింపఁబడికూడ నానంద విహ్వలతచే నృత్యముసల్పుట – అహా, ఈ ప్రేమానంద మెటుల మఱుగువడి యుండఁగలదు ?

ఇడుమలఁ గుడిచినమీఁదటనే మనుష్యుఁడు సువర్ణత్వము నొందుచున్నాఁడు – "యథాసహస్రథాప్మాతే, న మలంకిలకాంచనే" సహస్రపర్యాయములు కాచిన కాంచన మెటుల మలరహితమై, యుత్కృష్టకాంతి సమన్వితమై భాసిల్లునో యటులనే మనుజుఁడును, వేల

కొలఁది పర్యాయములు దుఃఖాగ్నియందు దహింపఁ బడిన పిదపనే నిగ్గుదేలి స్వచ్ఛ తేజోవిరాజితుఁ డగు చున్నాఁడు. భగవానుఁడు విపదగ్నియందుఁ బడఁద్రోసి మలినపూరిత కాంచన శరీరుని నిర్మలునొనరించు చున్నాఁడు. ఏమి, ఇది యానందకరమగు విషయము కాదా? తన ప్రేమాస్పదుఁడు నిర్మల సువర్ణత్వ మొందె నని గ్రహించినపిదప నెవ్వఁడయిన నానందింపకుండఁ గలఁడా? ఇందుచేఁ బ్రేమియొక్క హృదయపారావార మున – సుఖమునందు, దుఃఖమునందు, సంపదయందు, దారిద్ర్యమునందు – సర్వవేళల నానందతరంగము లుప్పతిల్లుచునే యుండునని చాటుచున్నాను. దుఃఖమున, విపత్తున మీరు స్థిరానంద మనుభవింపక పోయినచో రక్తమాంస సంకలిత స్వార్థకుండమును గామమోహ ములు స్వీయమొనరించుకొనిన వని నేను భావించు చున్నాను. మేము ప్రేమసాగరమునుండియే, నిర్మల మైన, స్వచ్ఛమైన, శీతలమైన ప్రేమను స్వీకరించితిమని మీరు చెప్పుచున్నచో నది కేవల మసత్యము. ప్రేమ యీ చంచల సాంసారిక సుఖదుఃఖముల మధ్య నొక క్షణ మేని వసింపఁజాలదు. ప్రేమ నిత్యము. అనిత్య సుఖమున ప్రేమ యాహ్లాదము నొందఁజాలదు. అనిత్య దుఃఖమునఁ

గూడ ప్రేమ బాధనొందఁజాలదు. నిత్యప్రేమస్వరూపుని యవలంబనముచేఁ బ్రేమయు నిత్యము.

యథార్థప్రేమ యశరీరి యగు నాత్మతో సంబంధము గలిగియున్నది. ప్రేమ కాశ్రయ మాత్మయేకాని శరీరము కాదు. ఆత్మ నిత్యము-శాశ్వతము. ప్రేమయు నిత్యము-శాశ్వతము. శరీరముతోఁ గ్రీడసలుపు ప్రేమ ప్రేమ కాఁజాలదు, అది మోహము. మీరు సాధారణార్థమున నుపయోగించు ప్రేమ ప్రేమకాదు, మోహము. జడ పదార్థమునఁ బ్రేమ యడుగిడదు. అస్థిచర్మమాంస రుధిర సంకలిత క్షేత్రమునఁ బ్రేమకుఁ దా వెచ్చట?

నే నొక బాలికారత్నమును జూచియుంటి. ఆమె యొక మనుజుని బ్రేమించుచుండెను. అతనిన్ని తండ్రీ, సోదరా, సోదరీ, అత్తా— అని యీ విధమున వివిధ నామములతోఁ బిలుచుచుండెను. ఒకనాఁ డొక వ్యక్తి యామెను, ఏమమ్మా! నీకు స్త్రీపురుషజ్ఞానము కూడ లేదా? అని ప్రశ్నించెను.

"ఎటులుండును! మహాశయా! నే ప్రేమించువ్యక్తి స్త్రీయో పురుషుఁడో తమరు చెప్పఁగలరా? మన కందఱకుఁ బ్రేమపదార్థ మెద్దియో యది స్త్రీయో పురుషుఁడో వచింపఁగలరా? ఏమి, అది బాహ్యశారీరక

పదార్థమా?" అని యా బాలిక ప్రత్యుత్తర మొసంగెను.

నే నీ ప్రత్యుత్తరమును విని నిశ్చేష్టితుఁడనై పోయితి. యథార్థముగా నీమె ప్రేమించుట నేర్చినదని నే భావించితి. ఇందువలననే యామె యత్యంతాల్పవయస్సుననే పృథ్వికి దూరమైపోయెనని గ్రహించుచున్నాను. ఆమెను స్మరించినంతనే నేను దివ్యానంద మనుభవించుచుంటిని.

మీరు ప్రేమయని వచించునది యథార్థప్రేమయగునో కాదో పరీక్షించుటకై మీ ప్రేమ శరీరముతో నాబద్ధమై యున్నదో, లేదో, మరణానంతరమునఁ గూడఁ బ్రియుని నీ విధముగనే ప్రేమింతురో లేదో, ధ్యానపూర్వకముగా నిరీక్షింపవలెను. ప్రియుని విషయమై తలపోయునపుడు వాని యవ యవ సౌందర్యమునుగూర్చి విచారించుచుంటినో, లేక వాని యాధ్యాత్మిక సౌందర్యమును గుఱించియు, నైతికశక్తి సామర్థ్యముల గుఱించియు విచారించుచుంటినో యని యెల్లరును బరీక్షించుకొనవలెను. నేఁడు వాఁడు లోకకల్యాణార్థము చిరకాలము నిన్నెడఁబాయుట నాకాంక్షింతువో లేక జగన్మంగళము వైపునకే మనసుఁ బోనీక, నీ వక్షస్థలముననే మస్తకము నుంచి సర్వదా నీతోఁ బ్రేమకథాకలాపమునఁ బ్రొద్దు పుచ్చుటయే యభిలషింతువో బాగుగా గ్రహింపుము.

వక్షస్థలమున శిరస్సునుంచుటయే వాంఛించుచో 'ప్రేమ' యను పేరుతో మోహము నాహ్వానించితినని భావింపుము— అమృతమని తలఁచి విషమును పానమొనరించితినని కనుగొనుము.

మహాభారతమున విదులోపాఖ్యానమున యథార్థ ప్రేమకు సుందర దృష్టాంత మొకటి లభించుచున్నది. విదుల రాజమాత, సంజయుఁడను వాఁ డామె పుత్రుఁడు. సింధురా జాతని రాజ్యమును హరించిన పిదప సంజయుఁడు భగ్నోద్యముఁడై విషణ్ణచిత్తుఁడై పడియుండెను. అప్పుడు విదుల యతని భయపెట్టుచు నీ విధముగ నుడివె— "నీవు వజ్రాహతుఁడవై మరణించినవానిరీతిగ జడభావముతోఁ బడియుంటివేల ? ఒక్కసారి లెమ్ము. ఈ విధముగఁ గాపురుషునిరీతిఁ బడియుండకుము. ప్రచండాగ్నివలె నొక్కతూరి శత్రుమస్తకముపైఁ బ్రజ్వరిలుము. ఈ రూపమున జీవించుటకంటె మరణించుటయే యుత్తమము. సామర్థ్య మున్న నీ వీరత్వమును వెల్లడింపుము. లేనిచోఁ బంచత్వమును స్వీకరింపుము. ఒక్కసారి నీ కులమర్యాదను సంస్మరించి యపహృత రాజ్యోద్ధరణార్థమై యత్నశీలుఁడవు కమ్ము. పరముఖాపేక్షియు, పరపిండోపజీవియునయి, నికృష్టభావముతో జీవనయాత్రఁ

గడపువాని నెప్పుడు ననుగమింపకుము. నిన్నాదర్శ ముగా నుంచుకొని వేలకొలఁది వ్యక్తులు జీవింపవలెను. సత్కార్యానుష్ఠానమున సద్యశంబు గడింపనివాఁడు కేవలము మనుష్యసంఖ్యను బెంచువాఁడే. వాఁడు స్త్రీ యని కాని పురుషుఁడని కాని వచింపఁబడఁ జాలఁడు. దానము, తపము, సత్యము, విద్య, అర్థలాభము—వీని సంబంధమున నెవని యశోవృత్తాంతము సంకీర్తింపఁ బడదో వాఁడు మాతయొక్క పుత్రుఁడని చెప్పఁబడఁ జాలఁడు. శాస్త్రజ్ఞానమున, తపస్సున, అర్థసముపార్జన మున, పరాక్రమమున నితరుల నతిక్రమింపఁ గలవాఁడే యథార్థపురుషుఁడు. ఓ సంజయా! అందుచే నీవు స్వీయపరాక్రమమును బ్రదర్శించుట, కుద్యుక్తుఁడ వగు టయే సముచితము. లెమ్ము, ఒక్కసారి ప్రజ్వరిలిన కార్చిచ్చువోలె శత్రుగణమధ్యమున కఁజికి రిపులను జెండాడుము".

"అమ్మా! నేను రణరంగమునఁ బంచత్వమును స్వీకరించినచో నీ కెటుల సుఖమబ్బును? నేను నీకుఁ బ్రియ పుత్రుఁడను. నన్ను బోఁగొట్టుకొనిన పిదప నీ కీ సమస్త పృథ్వీరాజ్య మొదవినను లాభమేమి?" అని పుత్రుఁడు వచించెను.

"నేను నీ జీవితమరణములఁగూర్చి విచారించుట లేదు. ఈ పృథ్వియందు జీవనము ధరించుట కేవలము ధర్మముకొఱకే. అట్టియెడ ధర్మమునకే నష్టమొదవిన పిదప జీవనమువలనఁ బ్రయోజనమేమి? నీ ం . ం యవస్థను బరికించి స్నేహవాత్సల్యముచే భీరువనై దీనిని దూరమొనరించుటకు నిన్ను బ్రతిఘటింపనిచో నా స్నేహము స్నేహమే కాదు. అట్టి ప్రేమను బండితులు సామర్థ్యశూన్యమగు గార్దభవాత్సల్య మను పేరుతోఁ బిలుతురు. మనుష్యవాత్సల్య మీ రీతి మోహప్రపూర్ణమై యుండఁజాలదు." అని జనని ప్రత్యుత్తర మొసంగెను.

సంజయుఁడు జనని పలుకు లాలించి యామె యాదేశ పాలనమున, కుద్యుక్తుఁడై తిరిగి తనరాజ్యము నుద్ధరించెను.

దీనిపేరే సత్యప్రేమ. విదులయొక్క ప్రేమ శాశ్వతమైనది. ఆమె ప్రేమ, పుత్త్రుని శరీరము నతిక్రమించి వాని యాత్మతో లీనమైపోయెను. పుత్త్రుని మరణము నకై దుఃఖింపవలసిన కారణము లామె కేమియు శోఁక లేదు. ధర్మావలంబనమునకై పుత్త్రుఁడు మరణించినను నిత్యానందమే యామెకు. ప్రేమ యీ రూపమును

దాల్చియుండవలెను. ఇట్టి ప్రేమ యిహపరములు రెంటి యందు సమానరూపమున వ్యాప్తినొందుచున్నది. ప్రేమాస్పదుఁ డెచ్చటికేగును? శరీర మిహలోకమును బాసినచో దానివలన లోటేమి? నిత్యము, శాశ్వతమునైన యాత్మనే నేను స్వీకరించితి; అది నన్నాశ్రయించియే యుండును. దానిఁ జుంబనాలింగనమొనరించు శక్తిని నా నుండి యపహరింపఁగల సామర్థ్య మెవ్వనికిఁగలదు? ప్రేమి యీ దృశభావప్రపూర్ణుఁడై యానందముతో నృత్యము సల్పుచున్నాఁడు. శాశ్వతమైన పర్వతశిఖరముపైఁ దనకుటీరమును నిర్మించుకొనిన వాఁ డధోలోకమున నొకటి రెండు, చంచలమేఘఖండముల యావిర్భావ తిరోభావముల వీక్షించి విషణ్ణచిత్తుఁడగునా? వాఁడచట నిత్యపదార్థతనొంది నృత్యము సల్పును.

మఱియుఁ బ్రేమయందు నవీనతకూడకలదు. ప్రేమాస్పదుఁడు నవ్య - నవీనుఁడు, నిత్యనూతనుఁడు. నూత్న నూతన సౌందర్యము క్షణక్షణమునను బ్రస్ఫుటమగుచున్నది. ప్రేమతోఁ జంద్రుని విలోకించిన నెపుడైనను బురాతనుఁడుగాఁ గాన్పించునా? చంద్రునిజూచి యెవ్వఁడయిన, "వీఁడు పురాతనుఁడు, నే నెప్పుడును వీనిఁ దిరిగిచూడను" అని చెప్పినాఁడా? గులాబి యెప్పుడైనఁ

బురాతనముగాఁ గాన్పించుచున్నదా ? ప్రతిదినము గులాబిని నాఘ్రాణించుచున్నను నేఁడు నా కిది నచ్చలేదని యెప్పుడైన మనసున నసంతృప్తిగల్గునా ? మధురమైన దెప్పుడును నూతనమే ! తల్లియెదుట బాలుని ముఖ మెప్పుడైనఁ బురాతనముగాఁ గాన్పించునా ? లేదు — అల్లెన్నటికిని గాఁజాలదు. ఎవనిని బ్రేమించుచుంటిమో వాఁడు సర్వదా నూతనుఁడు. ఎవఁడు ప్రేమించుచుం డెనో వాఁడును సదా నూతనుఁడే. ప్రేమాస్పదుని ముఖవిలోకనముచేఁ బ్రతిదినము హృదయకుహరమున నూత్నభావతరంగము లెన్నియో క్రీడావిలాసములు సలుపుచున్నవి. నా ప్రేమాస్పదుఁడే కాకిరియై విశ్రమించి, శాంతచిత్తుఁడై స్వీయకార్యకరణనిమగ్నుఁడైయున్నచో, నేను నిర్నిమేషుఁడనై వాని ముఖమండలముపై నెన్ని నవ్య సౌందర్య తరంగములు క్రీడసల్పుచున్నవో నిరీ క్షించుచున్నాను.

సోదరులారా ! ఏఁబదివత్సరముల బంధుత్వ మెప్పు డైనఁ బురాతనమగునా ! పురాతనమగుచో నది బంధు త్వమే కాదు. అది మోహశృంఖల. మోహప్రకాశ మున్నన్నిదినములు వాఁడు నూతనుఁడుగనే కాన్పించును. ఆ మెఱుఁగు మఱుఁగుపడిన వెంటనే ప్రాచీనుఁడై పోవును.

పతివ్రతాశిరోమణి తనపతియందే జీవితమరణములు, ఇహాపరలోకములు, సర్వస్థానములు, సర్వావస్థలయందు నూత్న నూతనమాధుర్య క్రీడలను వీక్షించుచున్నది. ఇటులనే, జనకుఁడు తన పుత్రునియందు - అధ్యాపకుఁడు తన శిష్యునియందు విలోకించుచున్నారు.

ప్రేమ యెటుల నిత్యమో యటులనే నూతనము - ఉన్నతము. స్వర్గముయొక్క యుచ్ఛత్వము దీనియందుఁ బ్రతిఫలించియున్నది. క్షుద్రత్వ నీచత్వములు ప్రేమయందు లభింపఁజాలవు. నీచతయొక్క-నరకముయొక్క భావ మంకురింపఁగనే ప్రేమ దానిని దూరమొనరించుచున్నది. ప్రేమాస్పదుని వస్త్రములుసైతము నీచభావముల నాశనమొనరించుచున్నవి. ప్రేమ యుచ్ఛమునుండి యుచ్ఛతరముపైపున కడుగిడి, క్రమముగా నుచ్ఛతమము వఱకుఁ బ్రవేశించి వాంఛను నశింపఁజేయుచున్నది. ఏ ప్రేమచే మనుజుఁ డున్నతినొందఁడో, యా ప్రేమ ప్రేమకాదు.

ఇరువురు మిత్రులలో యథార్థప్రేమ యున్నదో లేదో పరీక్షింపఁగోరినచో వా రిరువురుఁ గ్రమోన్నతి నొందుచుండిరో, లేరో, పరస్పర సమ్మేళనముచే వా రిరువుర జీవితచరిత్రలు క్రమముగ నిర్మలతమములై నెగడు

చున్నవో లేవో, కర్తవ్యజ్ఞాన మధికాధికముగఁ బ్రస్ఫుట మగుచున్నదో, లేదో, ఆధ్యాత్మికచింతనము మఘురతమమగుచున్నదో, లేదో, లెస్సగాఁ గనుగొనుఁడు. అవి లేనిచో నిరువురు మిత్రత్వమని భావించునది మిత్రత్వము కాదనియు, నవనతికి సోపానమనియు నెఱుఁగుఁడు. వారి నొండొరుల విచ్ఛిన్న మొనరింప నుంకింపుఁడు.

ప్రేమ స్వర్గమువైపునకు ధావమానమగుచున్నది. స్వర్గాకర్షితముకాని ప్రేమను మీ గృహముదగిరిఁ జేర నీయకుఁడు. ఎవరైన నిద్దఱుమనుజులు నదీతీరమునకేగి, కంఠాలింగన మొనరించుకొని యనవసర ప్రలాపములఁ బ్రేలుచు స్వర్గముమాటయే యెత్తక యామోద వినోదముల విలీనులై, యేదైన గంభీర విషయమునచ్చిసంతసే తల్లడిలసాఁగినచో, సర్వనాశనమైనదనియు, వీరిని మృత్యుదేవతయే యిటఁ జేర్చినదనియు భావింపుఁడు. కేవలము భౌతికసుఖమున్నచోటఁ బ్రేమయుండఁజాలదు. ప్రేమనుండి భౌతికామోదమును వేఱుపఱుచుట నా యాశయము కానప్పటికిని దానియందు స్వర్గచిత్ర మున్నట్టి పడు పదార్థమే యుండవలెను. స్వర్గమునఁ జంచలత లేదు. ప్రేమియుఁ బ్రియుఁడును, స్వీయగంభీరతమ హృదయక్షేత్ర పవిత్ర రహస్యాకాంక్షలను వెల్లడించు

కొని పరస్పరము కంఠాలింగన మొనరించుకొని, స్వర్గ రాజ్యమును బ్రవేశించుచున్నారు. ఇట్టిభావము లేని చోటఁ బ్రేమ లేదనియే గ్రహింపుఁడు.

ప్రేమయొక్క వ్యాపకత్వమును సంభావించినంతనే యత్యద్భుతానందము గల్గుచున్నది. అది విశ్వవ్యాప్తుని స్వీయకోశ పదార్థము. అందుచేతనే యది ప్రపంచము నెల్ల నాచ్ఛాదిత మొనరించుటకు సర్వదా యువ్విళ్లూరుచుండును. దానియందుఁ గ్రమవిస్తృతి కలదు— అది క్రమక్రమముగా వ్యాపించుచున్నది. నేఁ డొక మనుజుని బ్రేమించితిని; వాఁడింకొకని దీసికొనివచ్చెను, చాలు, వా రిరువురయందుఁ బ్రేమ యుత్పన్నమైనది — మధుకోశ నిర్మాణము సంసిద్ధమైనది. క్రమముగా నొక రిరువురే వచ్చుచు, వచ్చుచు నెందరో సమావేశమయిరి. ఒకఁడు, ఇరువురు, ముగ్గురు, క్రమముగాఁ బదుగురు, నూర్గురు, వేవురు- ఈ రీతిఁ బ్రేమాస్పదులసంఖ్య పెరుగుచుఁ బోయెను. ప్రేమాచరణ మెంత తీవ్రమగునో అంతమాత్రముగనే ప్రేమి లోకసౌందర్యమును నిరీక్షించుచున్నాఁడు— అనేక జీవులఁ బ్రేమింపఁ గల్గుచున్నాఁడు. క్రమముగ సమస్తమానవలోకమునందును బ్రేమ వ్యాప్తి నొందుచున్నది. తుట్టతుదకు మానవరాజ్యము నధిగ

మించి, సమస్త చేతనాచేతనపదార్థములయందును ప్రవే
శించుచున్నది. అప్పు డది మధురవర్షముఁ గురియించుచు
జగన్మయ మగుచున్నది. బుద్ధదేవుని ప్రేమఁ జూడుఁడు
జగన్మయము; చైతన్యప్రభుని ప్రేమఁ జూడుఁడు— జగ
న్మయము. యథార్థప్రేమి యెల్లెడల సత్యమునే నిరీక్షించు
చున్నాఁడు.

"లలితలావణ్య చంద్ర విలాసమందుఁ
దీక్ష్ణతరభాను విమల దీధితులయందు
మేఘములయందు, నదుల, సమీరమందు
సర్వసచరాచరాత్మక జగతియందు
నొలుకుచున్నది, సతము—పీయూషలహరి"

ఇట్టి యవస్థను బొందినపు డానందమున కంతముండదు.
ఎదుటఁ జూచిన వస్తువుల నన్నిటి నాలింగనమొనరించు
కొనుట కాతురతఁ జూపుదురు; వృక్షముయొక్క
పత్రపత్రమును ముద్దిడుకొనుట కభిలషింతురు;
మలయమారుతము నొడికిఁ జేర్చుకొని నిదురింప నాకాం
క్షింతురు; తటాకమునందలి ప్రతిజలబిందువును, చంద్ర
దేవుని ప్రతి కిరణకణములను, దమ ప్రాణములమధ్య
మఱుఁగుపఱిచి యుంచుకొనుటకు నుత్సుకతఁ జూపుదురు;
వీధియందలి ధూళిని హస్తముల నిడుకొని విహ్వలతఁ

జెందుదురు; ఆ జ్యోతినుండి యమృతధార ప్రవహింప సాఁగును— దీనికి వ్యతిరేక ఫలితములు లభించినచో ప్రేమ యట లేదు. క్షుద్రసీమమధ్యఁ బ్రేమ వసింపఁ జాలదు. ప్రేమ కూపతుల్యము కాదు, అది సమస్త విశ్వ మును బరిగ్రహించి సంతృప్తినొందక తపించుచు, నుత్తుంగ తరంగముల వెఱలఁగ్రక్కుచున్నట్టి మహాసాగరము. విశ్వము నకు హద్దుకలదు; కాని ప్రేమకు హద్దుఁగానము. అది యింకను నావశ్యకమను నాకాంక్ష యనంతకాల పర్యంతము నంతమొందదు.

యువకులారా! ఇట్టిప్రేమకే భిక్షుకులు కండు. క్రమ ముగ మీా ప్రేమ విశాలమగుచున్నదా? రాముని బ్రేమించినటులనే యన్యులఁగూడఁ బ్రేమించుచుంటిరా? మనుజులనందఱను హృదయమున మఱుఁగుపఱిచియుంతు మనెడి యాకాంక్ష మీా యందఱ మనంబుల ఘనీభవించి యున్నదా? అన్యుని ప్రేమవిస్తృతిని విలోకించిన సుఖము కలుగుచున్నదా? 'అవును' అని ప్రత్యుత్తర మొసంగుచో యత్నపూర్వకముగ దాని రక్షింపుఁడు. ప్రేమయందు హింస ప్రవేశించినదనియు, రాముఁడు నిన్ను ప్రేమించు నటులనే యన్యులఁగూడఁ బ్రేమించిన నీర్ష్య గల్గుచున్న దనియు, వాని హృదయమున నెవనికిని స్థాన మొసంగక

నన్నే ప్రాణధనముగా నొనరించుకొనవలెనను కాంక్ష బలపడుచున్నదనియు గ్రహించినవెంటనే యా ప్రేమను గాలఁదన్ని హృదయమునుండి పెకిలివేయుఁడు. లేనిచో మీ ప్రేమయందు నమృతమునకు మాఱు మీ ప్రాణముల నాశన మొనరించు విష ముత్పన్న మగును.

(Love one, Love no more) ఒక్కమనుజునే ప్రేమింపుము, ఒక్కనిమించి వలదు. ఇది సైతాను యొక్క మాట. (Love all things, Both great and small) పెద్ద, చిన్న – సమస్త పదార్థములను బ్రేమింపుము – ఇది భగవానుని యాదేశము. ఇందుచే సమస్త పదార్థములఁ బ్రేమింపుఁడు. ఎవ రీ విధి నెంతెంత పరిమాణము ప్రేమించుచుండిరో, యంతమాత్రమే సాధువులగుచున్నారు. క్రీస్తు, గౌరాంగుఁడు, బుద్ధుఁడు, గాంధీమహాత్ముఁడు – మొదలగు సమస్త దేశముల సాధు పుంగవులకును జపమాల యిదియే.

శత్రువునిగూడఁ బ్రేమింపుఁడు. ఏమి, వాఁడీ ప్రపంచమునుండి ప్రత్యేకింపఁబడెనా ? వాఁడీ ప్రేమ ప్రపూర్ణ రాజ్యమున వాసముచేయుటలేదా? అయిన శత్రువెవఁడు? నేను శత్రుత్వమునందే ప్రేమయొక్క క్రీడను విలోకించు చున్నాను. వాని ఖడ్గమునుండి యమృతబిందువులు

స్రవించుచుంట మీరు కాంచుటలేదా? శత్రువు యథార్థమే, కాని సత్యముగ మిత్రుఁడుకూడను. వాఁడెన్నియో భంగుల మనకెంతయో యుపకారమును సాధించు చున్నాఁడు. ఈ ప్రేమమయ రాజ్యమున మీర లిచ్ఛతోఁగాని, యనిచ్ఛతోఁగాని వానికి మేలొనఁ గూర్పనిచో - ప్రేమకు సాహాయ్య మొసంగనిచో మీరు నిర్వహింపఁగల్గుటెటులు? మీరే రాజ్యమున నివసించు చుంటిరో కొంచెమైన జ్ఞప్తియున్నదా? శత్రువు ప్రేమ యొక్క మూలమును గుఠారాఘాతముపాలొనరించు చున్నాఁడని మీరు భావించుచుందురు కాఁబోలు, కాని దానికి విపరీత ఫలితము లభించుచున్నదని గ్రహింపుఁడు. పాపము, వాఁడు విష మొసంగఁగోరుచున్నను అమృతమే యేతెంచుచున్నది. మీరీ విషయమై యేమిచెప్పఁగలరు? ఈ యమృతమయ రాజ్యమున నిటులనే సంభవిలు చున్నది. క్రీస్తు మహనీయుఁడు నాటిన వృక్షమేవిధము గను బుష్పఫల సమన్వితము కాకుండునటుల వారితో విరోధింపవలెనని యూదు లూహించిరి. కాని, ఆహా! ఏమాయెను? వారి శత్రుత్వము మిత్రత్వముగాఁ బరిణ మించెను. వారందఱును నాశన మొనరింపఁ బ్రయత్నించుట కతననే నేఁడు, సమస్త ప్రపంచమునఁ గ్రీస్తుయొక్క

ప్రేమవృక్షము వ్యాప్తినొందెను. ప్రహ్లాదుఁడు ప్రేమోన్మాదికాకుండఁ గలందులకై హిరణ్యకశిపుఁ డెక్కుడుగా వానితో విరోధించెను. ఏమాయె! ఏ మొనరించుటచే నేమి సంభవిల్లె!! పాపము, పాపము-హిరణ్యకశిపుఁడు!!! ప్రహ్లాదుని యున్మాదమే సమస్త ప్రపంచము నాక్రమించెను. ఇందుచే సాధువులతో శత్రుత్వ మూనుట సాధ్యముకాదని నుడువుచున్నాను. మీ గృహంబున, మా గృహంబున గ్రామసంబంధమగు అలజడికాని, శత్రుత్వముకాని యున్నచో నేత్రములున్నవారు పరికింపఁ గల్గుచున్నారు. దీనిమధ్య వసించి మనుష్యుఁడెంత మాత్రము ప్రయత్నించునో భగవానుఁడు సంతమాత్రమే ప్రేమ నుత్పన్న మొనరించి యొసంగుచున్నాఁడు. మనుష్యుఁడు శత్రుత్వోద్భూత ఘోరఘనంబుల సలంకరించి తర్జనగర్జనములొనరింపసాగుట,యీ జీవనముసందే యనేక పర్యాయములు విలోకించియుంటిని. భీతిచేఁ బ్రాణములు తల్లడిలసాఁగె. కాని విధాతృలీలలు వర్ణింపఁ దరమా! దానిమధ్యనుండియే ప్రేమసౌదామిని ప్రకాశింపసాఁగెను-కుంభవృష్టి కురియనారంభించెను. ప్రాణాంతర్భూతములగు తాపము, అహంకారము, అభిమానము, స్వార్థపరత, అనవధానత- మొదలగు సర్వదురితజాలములు దూరమై

పోవునటుల, హృదయము శాంతించునటుల, సద్వృత్తి యత్యంత వేగమున వృద్ధినొందసాగునటుల, నేనే ఘోర పరాజయమొందితి నని శత్రువు భావించెను. యుగయుగములనుండి జీవించు శత్రువులారా! సర్వదా శత్రువును మిత్రుఁడని వచించుచు వాని నాలింగనమొనరించుకొనుట కిచ్ఛవొడమినపుడే — అటులొనరించుటకు మీ మనసు వ్యగ్రతనొందినపుడే, త్రికరణశుద్ధిగా వారి యన్యాయ్యాచర్యకుఁ బ్రతివాదమొనరించుట నిషేధింపఁజాలననియు— అదియే నా కర్తవ్యమనియు గ్రహింపఁగలిగినపుడే, పుత్రుని దుశ్చేష్టల నెటుల శాసింతురో, యటులనే శత్రువుని దుర్వ్యవహారముఁగూడ శాసింపఁగలిగినపుడే, శాసించిన ప్రకారంబ వానిఁ జుంబనమొనరించినపుడే— అందులకుఁ బ్రాణములు వ్యాకులతనొందినపుడే, ప్రేమ పరిపక్వమైనదని గ్రహింపుఁడు.

ప్రేమయొక్క సర్వప్రధాన ధర్మము స్వార్థరాహిత్యము. అది స్వార్థము నెప్పుడు నెఱుంగదు. అన్యులకై యున్మత్తమైయున్నది. అది తన గృహంబున వసింపఁజాలదు. అన్యులకు సేవసల్పుటయే దాని జీవితవ్రతము. ఇంక వేఱు వచింపవలెనా! దానికి సర్వమును స్వీయమే. స్వార్థపరతయు, ప్రేమయుఁ బరస్పర విరోధులు. స్వార్థ

పరతగలచోటఁ బ్రేమ నిలువదు. ప్రేమ యున్నతావున స్వార్థపరత యుండఁజాలదు. ప్రేమ యభివృద్ధినొందిన కొలఁది స్వార్థపరత నాశనమగుచుండును. (Love varies inversely as selfishness) ప్రేమి ప్రియునికొఱకై స్వార్థత్యాగ మొనరించుచున్నాఁడు. అత్యంత క్షుద్ర విషయమునుండి, మహోన్నత విషయమునందుఁగూడఁ బ్రేమి యీ లక్షణమునే విలోకించును; సామాన్య స్వచ్ఛంద సుఖమునకై యత్యల్ప పదార్థమును భోగించుటకుఁ గూడఁ బ్రథమముననే ప్రేమాస్పదునికి సుఖ మొనగూర్పవలెను. లేనిచో ప్రేమి దానిననుభవింపఁ జాలఁడు. ఈ విధముననే విషమసంకట పరిస్థితిలో— మరుభూమియందు — ప్రాణము లిప్పుడో, యింకఁ గొంచెముసేపటికో త్యజించునటులుండు సమయమున - ఒక్క మనుజునికంటె పెక్కురు త్రాగుటకు లభింపని జలముగలచోట – ప్రేమి ప్రథమమున బ్రియునిఁ జీవితమును రక్షించును; తుట్టతుదకు తాను. ఒకానొక ప్రాచీన యాఖ్యాయికయందు నేనీ రీతిగఁ బఠించియుంటి- ఇరువురు మిత్రులు కలరు. అందొకఁడు, మిత్రునితో 'నీవు జీవింపుము, నేను మరణింతును,' అనెను. అంత రెండవవాఁడు 'కాదు—అటుల వీలులేదు, నేనే మర

ణింతును' అని వచించె. ఈ విధ మొండొరు లెవ్వానిని మరణింపనీయలేదు. ఇరువురును దన ప్రాణము నొసంగి తన బంధువుని ప్రాణరక్షణ మొనరించుట, కున్ముదులై యుండిరి. ప్రేమియొక్క లక్షణ మిదియే !

ప్రేమి యెల్లవేళలఁ బ్రేమాస్పదుఁడు తన వక్షస్స్థల ముపై విహరించుట యాకాంక్షించుచున్నాఁడు. అయిన వానికి స్థానమెచ్చట ? వాఁడు నాది నీచస్థానమనియు, నా ప్రియునిది యున్నతస్థానమనియు భావించును. జ్ఞప్తి యుంచుకొనుఁడు — ప్రేమి తన్నుఁ దా నల్పముగనే తలంచుచుండును; సమస్త బ్రహ్మాండము ప్రేమ ప్రపూరితమై నా వక్షస్స్థల మాక్రమింప, నొక్కమ్మడి నధః పతితుఁడనై తిననియు, నీ విధము ప్రేమాస్పదులసంఖ్య యభివృద్ధి నొందినకొలఁది నింకను నధోలోకముననే యరుగుచుంటిననియుఁ దలఁచును. స్వీయ భోగసుఖ ప్రాణరక్షణాపేక్షలు ప్రేమాస్పదుని భోగ సుఖ ప్రాణ రక్షణాపేక్షలతోఁ దుల్యములు కాఁజాలవు.

నే నొకస్థానమునఁ బ్రేమ కొక యుదాహరణమును బొందితి. అది మీకు వివరింతు – పదుమూఁడు వర్ష ముల బాలుఁడొకఁ డిరువది నాల్గు వర్షముల ప్రాయము గల యువకు నొకని నధికముగాఁ బ్రేమించుచుండెను.

ఆ యువకుఁ డొకనాఁడు బాలకుని గృహంబున కేతెంచి జ్వరపీడితుఁడై యచ్చటనే యనేక కష్టములఁ గుడుచు చుండెను. ఒకదినము వాఁడా బాలకుని యింటివసారా యందుఁ దలగడదిండు సాహాయ్యమున నిస్పృహుండై పడియుండె. ఆ సమయమున నొక విషసర్పమును, మార్జాలమును, ఆ యింటి ముంగిట కలహించెను. పోరాడుచు నా సర్పము వసారా కెగఁబ్రాఁకి యా యువకుని కంఠముక్రింద నాక్రమించుకొని తన పడగను విశాలపఱిచి నిలువఁబడెను. యువకుని ప్రాణములు ఘోరసంకటమున మునిఁగె. పాపము, వాఁడు శవాకారమునఁ బడియుండెను. వానిని రక్షించువాఁడెవఁడు? సమీపవర్తులందఱు భయవశులై ముందున కడుగిడుటకే, జంకుచుండిరి. అందఱి హృదయములు గంపించసాగె; ముఖములు కాంతివిహీనములాయె; యుక్తాయుక్త జ్ఞానమరయఁ జాలకుండిరి; ఏమిచేయుటకును సాహసింపఁ జాలరైరి. బాలకుఁడు స్నానమొనరించుటకరిగియుండెను. స్నానముచేసి తిరిగివచ్చుచు బాలుఁ డీ ఘటన నవలోకించెను; చూచుటతోడనే ప్రాణములయం దాశఁ బరిత్యజించి తన హస్తముల కంగవస్త్రమును జుట్టుకొని, యొక్కుమ్మడి నా సర్పఫణమును రెండుహస్తములతో

నదిమిపట్టెను. అందఱు నిస్తబ్ధులైరి; స్వర్గమునఁ బ్రేమ దుందుభి మ్రోగసాగెను; భగవానుఁడు బాలకుని శీర్షముపైఁ బ్రేమ వృష్టిని వర్షింపసాగె. ఆహా! ఎట్టి మనోహరదృశ్యము! దీనిపేరే ప్రేమ. యువకుఁడు మేల్కాంచి తన బాలమిత్రుని యవస్థఁ బరికించి దీనుఁడాయెను. ఆ సర్ప మా బాలకుని హస్తములఁ జుట్టుకొనసాగె. బాలకుఁడాయుధమును గోరెను. సమీపముననే యున్నవాని సోదరుఁ డాయుధమును విసరివేసెను. అంత నా యువకుఁడద్దానిని బరిగ్రహించి సర్పమును ఖండఖండములుగా ఛేదింపఁ బిదప బాలకుఁ డా సర్పమస్తకమును దూరముగా విసరిపాఱవైచెను. ప్రేమ యన నేమియో యా బాలకుఁడే గ్రహించియున్నాఁడు. దానంజేసి తన మిత్రునకై స్వీయ ప్రాణ పరిత్యాగమునకుఁగూడ వెనుదీయలేదు. మిత్రుని విపద్దశ విలోకించి తన ప్రాణములఁ దృణప్రాయముగాఁ, దుచ్ఛముగా భావించి సర్పమస్తకమును బట్టుకొనుటకు సాహసించెను. వాఁడు ధన్యుఁడు; మనకందఱకు వాఁడు ప్రేమమహిమ నుపదేశించినాఁడు. అతని సోదరునకతనియందుఁ బ్రేమలేదు; ఆయుధము నొసఁగు సమయమునఁగూడ సమీపమున కేగుటకు వెఱపొందెను; అందుచేఁ దుచ్ఛుఁడు. కాని యా బాల

కుఁడు దేవతుల్యుఁడు - ప్రేమి యని చెప్పుటకు సర్వదా యర్హుఁడు. చూచితిరా! స్వార్థరాహిత్యమున కెట్టి ప్రకాశమానమగు చిత్రమో! నేఁ డొకతూరి యేకాంతమున విశ్రమించి విచారింపుఁడు. మీ హృదయములఁ గూడ నేవంవిధప్రేమచే నింపి కృతార్థులఁజేయ భగవానుని బ్రార్థింపుఁడు.

ప్రేమ ప్రతిఫలము నాకాంక్షింపదు. ప్రతిఫలమాకాంక్షించునది మోహము. వాస్తవముగాఁ బ్రేమయందుఁ బ్రతిఫలాపేక్షయే కానుపించినచో నది వాణిజ్యవృత్తి స్వీకరించినదని నమ్ముఁడు. యథార్థప్రేమి యీ వృత్తి నెప్పుడును వరింపఁడు. వాఁడు కేవలము ప్రేమనొసంగియే సుఖించుచున్నాఁడు. ప్రియునినుండి ప్రేమకుఁ బ్రతిఫల మొందుటకు వాఁడు వ్యాకులత చెందఁడు. స్వర్గ మీ మర్త్యలోకమునఁ బ్రతిదిన మెంతెగనో ప్రేమవృష్టిని గురిపించుచున్నది; కాని యెప్పుడైన నది ప్రతిఫలమపేక్షించునా! సూర్యచంద్రులు తమ ప్రేమ కిరణములచేఁ బృథ్విని రంజింపఁజేయుచున్నారు. కాని వా రెప్పుడైనఁ బ్రతిఫలము వాంఛించుచుంటిరా? ప్రేమి ప్రేమ దానమొసఁగుటయందే యున్మత్తుఁడగుచున్నాఁడు. వాఁ డొసంగుటయందే తన్మయుఁడగుచున్నాఁడు; కాని

కై కొనువిషయమై భావించుటయేలేదు. "ప్రేమకొఱకై ప్రేమింప" ఇదియే ప్రేమియొక్క ధర్మము. యువకులారా! మీ రెవరిని బ్రేమించుచుంటిరో వారుగూడ మిమ్ముఁ బ్రేమింపవలెనని యుత్సుకతఁ జెందుచుంటిరా? వారు ప్రేమింపమి, మీ ప్రేమయందు న్యూనత యేర్పడు చున్నదా? అటులే యైనచో మీరు ప్రేమించువారలు మీకు వాస్తవమైన ప్రేమపాత్రులు కారనియు, వారు కేవలము మోహమూర్తులనియు, మీరును మోహ కూపమునందలి మండూకములేకాని, ప్రేమసాగరము నందలి మీనములు కారనియు భావింపుఁడు.

ప్రేమయందు, గాంభీర్యమున్నది – భయంకరత్వములేదు
కౌతుకమున్నది – తరళతలేదు
ఆవేగమున్నది – ఉద్వేగములేదు
ఉచ్ఛ్వాసమున్నది – ఉద్వేలతలేదు
శాసనమున్నది – పేషణములేదు
వివాదమున్నది – విషాదములేదు
అభిమానమున్నది – అవమానములేదు.

ప్రేమ మహాగాంభీర్యమైనది — సాగరమురీతి నగాధ మైనది. అర్ధరాత్రమున, జగత్తు నిస్తబ్ధమై యున్నతఱిఁ బృథివియందలి జీవములన్నియు నిశ్శబ్దముగఁ బడియున్న

సమయమున, వాయురహితమున నాకు లల్లల నాడని యదనున — బ్రహ్మాండమున నొక గాంభీర్య మైన 'ఓమ్'కార ముత్పన్నమగుచున్నది. ఆ సమయముననే ప్రేమి తన ప్రేమాస్పదుని ధ్యానమున 'నిర్వాత నిష్కంప మివప్రదీపం' అగుచున్నాఁడు. తనయొక్కయుఁ దన ప్రియునియొక్కయు భౌతికశరీరముల మఱచిపోయి వాఁడాత్మానంద మనుభవించుచున్నాఁడు. ఆ సమయ మున బాహ్యజగత్తు క్రమక్రమముగా వాని మనంబు నుండి దూరమగుచున్నది — పృథ్వి వానిని సమీపించు టకు సాహసించుటలేదు, ఆకాశము, వాయువు భీతిలి యెంతయో దూరమున దాఁగుచున్నవి. వాఁడు యోగి రీతిఁ బ్రియుని యాత్మార్ణవమున మునిఁగి తనలోఁ దానే తన్మయత్వము నొందుచున్నాఁడు. వాఁడటుల నిమగ్నుఁడై యెట కేగుచుండెనో యెవఁడు వచింపఁగలఁడు! ఈ కార్యమున నతని కేమైన నపాయము వాటిల్లునేమో యను భయంబున దేవగణము, లుచ్ఛ్వాసనిశ్వాసములు గూడ వర్జించి యీ యనిర్వచనీయమగు నాత్మార్ణవ నిమజ్జనమును నిరీక్షించుచున్నారు. ఈ గాంభీర్య మహా వ్యాపార మెవని జీవనమున సంఘటిలుచున్నదో — ఎవఁడు దానిఁ బ్రయత్నపూర్వకముగ సాధింపఁగల్గు

చుండెనో, వాని ముఖమండలముపై నొక యపూర్వ గాంభీర్యశోభఁ దిలకింపఁ గలుగుచున్నాము.

ప్రేమి గంభీరుఁడు; కాని వాని గాంభీర్యమున భయంకరత్వము లేదు—అది ప్రసన్నతాదాయక గాంభీర్యము. దానిని వీక్షించుటచే భయమొదవదు—ప్రాణములు కంపింపవు. దానియందు రౌద్రము మచ్చునకైన లభింపదు. ప్రశాంత మహార్ణవము వీక్షించుచుంటచేఁ గలుగు భావములే ప్రేమియొక్క యానన విలోకనము చేత, నుద్భూతములగుచున్నవి. ప్రేమిని దిలకించుటచే హృదయమునకొక విధమగు గంభీరతానుభవము లభించు చున్నది; కాని వానిచెంత దాఁపఱికములేక సమస్త విషయముల నిర్భయముగ వచింపవచ్చును. ప్రేమియుఁ బ్రియుఁడును నిర్జనప్రదేశమున - అత్యంత నిర్జన ప్రదేశమున విశ్రమించి గంభీర భావముతో జీవన రహస్యతమ విషయముల నొండొరులు ప్రకటించుకొనుచున్నారు. ప్రేమాధారుఁడగు భగవానుని దరిఁజేరి వరదానమును- అభయభిక్షను వేఁడుకొనుచున్నారు. ఎవనిచెంత మీరు హృదయస్థ సమస్త గంభీరతమ రహస్యముల వెల్లడింప భయపడుదురో వానిని మీరు బాగుగఁ బ్రేమించుట లేదని భావింపుఁడు. గంభీరతమ విషయప్రకటనములే,

ప్రేమస్వరూప నిర్ణాయకములు.

ప్రేమ గాంభీర్యభరితమే కాదు— కౌతుక ప్రపూర్ణము కూడను. సాగర మత్యంత గంభీరమైనది; కాని దాని వక్షస్స్థలముపై నల్పములగు సుందర తరంగము లెన్ని క్రీడించుచున్నవి! భగవానుఁ డతిగంభీరుఁడు; అందుచేతనే సకలవిధ పుష్పములు వికసించుచున్నవి - సాయంసమయమున గగనతలమునఁ బలుభంగుల సువర్ణ కాంతు లుత్పన్నమగుచున్నవి - మాధుర్య భరితములగు మందపవనములు వీచుచున్నవి.

ప్రేమయందుఁ బరిహాసముకలదు, చిఱునగవు కలదు, ఆమోదముకలదు; కాని చంచలతలేదు. పుష్పమును విలోకింపుఁడు - బాహ్యములగు సుందరదళములు మనస్సుల నూఁగించుచున్నవి; కాని దాని యంతస్స్థలమున సుందరమగు కాలచిహ్న మొండు కాన్పించుచున్నది. అటులనే ప్రేమయందు బాహ్యమునఁ గౌతుకముఁ గాంచెదరు; కాని యా కౌతుక కేంద్రభూమియందే గాంభీర్యము గలదు.

ప్రేమామోదము తృణమురీతి నత్యల్పమై యెగిరి పోవునదికాదు. దానిపై గాంభీర్యమను బరువు మోపఁబడియున్నది.

ప్రేమయొక్క కౌతూహలము తరంగసదృశముకాదు. దాని యధోభాగమున గాంభీర్యమున్నది. ఈ గాంభీర్యమును గాంచినవాఁడే గ్రహింపఁగలుగుచున్నాఁడు. గ్రహించుటకూడ సులభసాధ్యముకాదు. సాధుజనులత్యంత కుతూహలులు; కాని యా కౌతుకమునఁగూడ వారు ప్రతి సమయమున నెంతయో గాంభీర్యతత్త్వమును నెలకొల్పుచుండుట లేదా! శ్రీ రామకృష్ణ పరమహంసతో సంభాషించినవార లీ మాటయొక్క యాథార్థ్యమును సహజముగా గ్రహింపఁగలుగుచున్నారు.

ప్రేమయం దావేగముకలదనియు నుద్వేగము లేదనియు నొకతూరి చెప్పియుంటిని. దానియందుఁ బ్రశాంత వ్యాకులత కలదు కాని వ్యాకులతలేదు. అది హృదయమును జీల్చి, దానిమధ్య – దాని యంతరతమ ప్రదేశమున – ఆత్మయొక్క యంతస్స్థలమునఁ బ్రేమాస్పదుని దాఁచియుంచుట కిచ్ఛ నుత్పన్న మొనరించుచున్నది; వారితోఁ దన్మయత్వము నొందుటకై యనవరతముఁ బ్రయత్నించుచున్నది.

ప్రేమ లభించినకొలఁది ప్రేమి దాని నాకాంక్షించుచునే యుండును. ప్రేమ రాజ్యాధీశ్వరుఁడు వాఁడెంతగాఁ గోరినను బ్రేమ నొసంగుచునేయున్నాఁడు. వజ్రములు,

మణులు, మాణిక్యములు, మీ రెన్నిటి నాకాంక్షించు చున్నారు? ఎన్నికోరినను, ననంతభాండారమునుండి మీకు లభింపఁగలవు; వారొసంగుదురు; కాని ప్రయోజన మేమి? మీ రింకను వాంఛించుచునే యుందురు.

ప్రేమయం దిట్టి వ్యాకులత గలదు, కాని యుద్వేగము లేదు. ఉన్మత్తత నాపాదించునది— స్థిరత్వమును నష్ట మొనరించునది ప్రేమ కాదు. ప్రేమ విరహమును బాగుగ సహింపఁగలదు. పతివ్రతాతిలకము పతికై వ్యాకులత నొందుచున్నది; కాని యామె పతి సమీపమున లేసందున నుద్వేగము నొందుచున్నదా? ఆత్మ సర్వదా ముష్టి యందే యున్నది, ఉద్విగ్నతఁ జెందుట యెందులకు! అయిదుగంటలకు మిత్త్రుఁడు వత్తునని వచించె; కాని రాలేదు — కేవల మింతమాత్రముననే మఱేమియు రుచింపనిచో — గురుతర కర్తవ్యసాధనము కష్టకర మైనచో నా ప్రేమ ప్రేమకాదు — మోహము. మీ ప్రేమ యీ జాతికిఁ జెందినదో లేదో, మీ ప్రేమాస్పదుఁడు మిమ్ము, నుద్విగ్న మొనరించుచుండెనో లేదో, మీకుఁ గర్తవ్యసాధనమున బాధ నొసంగుచుండెనో లేదో, పరికింపుఁడు. కార్య నిమగ్నులరైయున్నతఱి వారి దీప్తి మీ మనంబుల ఘనీభవించి కర్తవ్యసాధనమున

సాహాయ్యపడుచున్నదో, లేక బీడఁ గలుగఁజేయు చున్నదో పరిశీలింపుఁడు. బాధనే కలుగఁజేయుచున్న జాగ్రత్త!! మణిమాల యని భ్రమించి సర్పమును బరి గ్రహింపకుఁడు.

ప్రేమయం దుచ్ఛ్వాస మున్నది — ఉద్వేలత లేదు. చంద్రదేవునిఁ జూచి సముద్రుఁ డానందమున నుప్పొంగు చున్నాఁడు; కాని యెప్పుడైన వాఁడు తన తటప్రదే శము నధిగమించుచున్నాఁడా? ప్రేమాస్పదుని విలో కించిన హృదయ మానంద విహ్వలతఁ జెందుట సహజమే; కాని యా కారణముచే నెప్పుడును గర్తవ్యపాలనా జ్ఞానము కోలుపడఁజాలదు. పాఠశాల కేగు తఱిఁ జిర కాలమునకు మార్గమధ్యమునఁ జిటునగ వాలుకు ప్రేమాస్పదుని గాంచినంతనే ప్రాణము లానందప్రపూ ర్ణము లగును; హృదయమునఁ బ్రేమతరంగము లుత్ప న్నము లగును — ఇటులే కావలెను; కాని యిందుచేఁ బాఠశాల కేగుట బాధగాఁ దోఁచుట బాగుకాదు, అది యనుచితము. కాని వారి మూర్తిని హృదయమునఁ బాదుకొల్పి, వారి యాగమనానంద సౌరభము చే హృదయమును నింపివైచి, ద్విగుణోత్సాహముతోఁ గర్తవ్యసాధన మొనరించుటకు, నుత్సుకతఁ జూపవలెను.

ప్రేమ కర్తవ్యజ్ఞానమును దీక్ష్ణతర మొనరించుచున్నది. దానియందుచ్ఛృంఖలత్వములేదు. ప్రకృతి ప్రేమ మయము; ఎప్పుడైన నది విధినిర్దిష్టకర్తవ్యోల్లంఘనమున మొనరించుట నెఱుంగుదుమా? రామచంద్రుఁడు సీత నెంతగాఁ బ్రేమించెను? ఒకనాఁడు సీతాస్పర్శ సుఖాను భవమును వారీవిధముగ వర్ణించిరి.

వినిశ్చేతుం శక్యో న సుఖమితి వా దుఃఖమితి వా
ప్రబోధో నిద్రా వా కిము విషవిసర్పః కిము మదః ।
తవస్పర్శే స్పర్శే మమ హి పరిమూఢేంద్రియగణో
వికారశ్చైతన్యం భ్రమయతి చ సమ్మీలయతి చ ॥

"నాయీయనుభవము సుఖమో, దుఃఖమో — ప్రబోధమా, నిద్రయా? నా శరీరమున విషసంచారమగు చున్నదా యేమి? లేక నే నేదైన మాదకద్రవ్యమును సేవించి యున్మత్తుఁడనయితినా? కొంచెమేని యెఱుక పడుటలేదు. నీ స్పర్శచేనొకవిచిత్రమగు వికారముత్పన్న మయి నా సమస్తేంద్రియముల ముగ్ధములుగా నొనరించె, చైతన్య విభ్రాంత సమాచ్ఛన్నుఁడనై పోయితి — చేతనా జ్ఞాన మడుగంటె, ఏమి, నా యీ యవస్థ?"

ఆ రాముఁడే కర్తవ్యానురోధముచే నా సీత నే యనా యాసముగ నరణ్యమున కనుపలేదా? ప్రేమ సామ్రాజ్య

మునఁ బదార్పణ మొసరించుచు బుద్ధుఁడు తన ప్రాణ ప్రియయగు సతిని, యశోధరను గర్తవ్య పాలనమునకై విసర్జించెను. చైతన్యదేవుఁడు శచీమాతను, బత్నియగు విష్ణుప్రియను బరిత్యజించి ప్రేమ ప్రచారమునకై సంన్యాస ధర్మమును స్వీకరించెను - దక్షిణమున కేగునపుడు తన ప్రాణాధికులగు ప్రియశిష్యులు భూతలమున మూర్ఛితులై పడియున్నను దిరిగి యొక్కతూరియైన వారి నిరీక్షింపఁ గల్గెనా ?

వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి ।
లోకోత్తరాణాం చేతాంసి కో హి విజ్ఞాతుమీశ్వరః॥

ప్రేమియొక్క చేతస్సు పుష్పముకంటెఁగూడఁ గోమలము. కాని కర్తవ్యాహ్వానసమయమున వజ్రముకంటెఁగూడ నెక్కుడు కాఠిన్యమును వహించుచున్నది. స్వేచ్ఛా ప్రచారియగు ప్రేమయొక్క యీఛవిని సర్వదా హృదయముల నెలకొల్పుఁడు.

ప్రేమయందు శాసనముకలదు — పేషణము లేదు, పీడన లేదు. ఈశ్వరుఁడు మనల నందఱను బ్రేమించుచున్నాఁడు; కాని మనమత్యాచారముల నొనరించినచో క్షమార్హులము కాఁజాలము - అవశ్యము శిక్ష ననుభవించియే తీరవలయును. కాని యా శిక్షయందుఁ గ్రోధము

లేదు, కౌటిల్యములేదు; కేవలము క్రోధాభాసము మాత్రమే కలదు; కాని దానిమూలమునఁ బ్రసన్నత కలదు. జనకుఁడు సంతానమును దోషసంశోధనకై దండించుచున్నాఁడు, కాని కన్నులవిప్పి చూచినచో నా దండమునందుఁ బ్రేమప్రవాహ మూప్పొంగుచుండును. ప్రియుని దోషముల రూపుమాపుటకై యవశ్యము శాసింపవలెను; కాని పేషణము — అత్యాచారము, ఉత్పీడనము కూడదు.

ప్రేమదండనమున వికటత్వములేదు. దోషనాశనమునకై యొకక్షణమునకుఁ బూర్వము దండింపఁ బడినవారినే మఱుక్షణమున నొడియంపుఁ గూర్చుండఁబెట్టుకొనుచున్నారు. ప్రేమియొక్క శాసనచుంబనములు రెండును సమానములే; ఇందు, నత్యుక్తి వీసమేనియు లేదు.

ఒకబాలుఁడు తనప్రియుఁడగు నొకబాలుని నన్యాయకార్య మొనరించుటచే శాసించెను-దండించెను. అందుచేఁ బరస్పర సంభాషణ నిలిచిపోయెను. ఇరువురు నిరుప్రక్కలఁ బోయిరి. కొంతకాలమున కొకనాఁడు వారిరువురు నొకవృక్షచ్ఛాయను వచ్చిచేరిరి. ఒండొరులు స్పృశింపనేలేదు - పరస్పర సంభాషణకూడ శూన్యము.

సమయ మపరాహ్ణము. కాల మతిక్రమించుచుండె. 'నా ప్రియుఁడు భుజించెనో లేదో యెఱుంగుటెట్లు' అని శాసించిన బాలుఁడు విచారింపసాఁగె. కొంచెము నిదానించి వృక్షమువైపు దృష్టిసారించి – "ఓ వృక్షమా! నే నితరులఁగాదు, నిన్నే ప్రశ్నించుచుంటి. చెప్పుము, నీవు భుజించితివా, లేదా?" అని వాఁడు ప్రశ్నించె. అప్పుడు రెండవవాఁడును వృక్షమువైపే తిలకించి "ఓ వృక్షమా! నేనును నితరులతోఁగాదు. నీతోమాత్రమే చెప్పుచుంటి, నేను భుజించితిని" అని పలికె. ఆహా! ఎట్టి మనోహరదృశ్యము! శాసింపవలసిన బాలుఁడు శాసించెను. కాని పేషణ మొనరించుటకు – ఉత్పీడన మొనరించుటకు, వానికి హక్కు లేదు. ప్రేమ వాని పేషణ శక్తిని నపహరించివేసెను.

ప్రేమయం దభిమానముకలదు – అవమానములేదు. అవమానముగలచోట నభిమానమాధుర్యమును గ్రోలఁజాలము.

అప్పుడపుడు ప్రేమి యభిమానమునఁ దన్మయుఁడగుచున్నాఁడు. కాని ప్రియుని కంఠాలింగన మొనరించుకొనక యెంతకాలముండఁగలఁడు? అవమానభావము మనసునఁ దట్టినంతనే కంఠాలింగనాపేక్ష నశించుచున్నది.

గౌరాంగదేవుఁ డభిమానప్రపూరితుఁడై "యిప్పుడు కృష్ణుని జపింపను" అని నిశ్చయించుకొనెను. కాని యా ప్రతిజ్ఞ నిర్వహింపఁగలైనా? ప్రేమి యొకక్షణమునకుఁ బూర్వము "వెళ్లుము, ఇప్పుడు నేను నీతో మాటాడను" అని యనియు మఱుక్షణముననే యిటుల వచించు చున్నాఁడు.

ఆశ్లిష్యవా పాదరతాం పినష్టు-
మదర్శనాన్మర్మహతాం కరోతు వా।
యథా తథా వా విదధాతు లంపటో
మత్ప్రాణనాథస్తు స ఏవ నాపరః॥

"వాఁడు నన్ను గాఢాలింగన మొనరించుకొనకుండు గాత, దర్శన మొసంగక మర్మాహతునిగా నొనరించు గాత - ఏమిచేసినను నేను వానిసొత్తే, వాఁడే నా ప్రాణ నాథుఁడు." ప్రేమయం దభిమాన మీ రీతి దీర్ఘస్థాయియై యున్నది.

ఇంకొకమాట వచించియుంటి - ప్రేమయందు వివాదముకలదు, విషాదములేదు. ఇంతకుఁ బూర్వము నే వచించినది వినిన పిదప దీనిని గ్రహించుట సులభమే! బాహ్యమత భేదములచేఁ బరస్పర వివాదము సంఘటిలుట సహజమే; కాని దానిచే నాదరమునకు నష్ట

మొదవఁజాలదు. భగవానుఁడే ప్రేమాధారుఁడుగాఁగ, వారి చరణతలముననే యందఱ మైక్యమగుచుండ, సామాన్య బాహ్యవిషయోద్భూత వివాదమున విషాద మెందుల కుత్పన్నమగును ? హిందువులు, ముసల్మానులు, క్రైస్తవులు, విదేశీయులు - సర్వజనులు పరస్పరము గంభీర ప్రేమయందు బద్ధులు కాఁగలరు — అటులగుట ప్రాకృతికముకూడను. ప్రేమాధారుఁడును, ప్రేమస్వరూపుఁడును నగు పరాత్పరుఁడే విగతవివాదుఁడు. ఇకఁ బ్రకృత వివాదమునకు - విషాదజనక వివాదమునకుఁ దావెచ్చట ? రామకృష్ణ పరమహంసకును కేశవచంద్ర సేనునకును, మతవివాదము సంఘటిల్లె. కాని యా వివాదమున విషాదమెప్పుడు నుత్పన్నమయినటులఁ గానము. వారిరువురుఁ బరస్పరము కంఠాలింగన మొనరించుకొనిరి. అట్టి పవిత్రప్రేమను ఈ వివాదము దూర మొనరింపఁ గల్గునా ?

ప్రేమయొక్క లక్షణము లనేకములు వచించియుంటి. ఉపర్యుక్త లక్షణ సంకలిత ప్రేమను సాధించుటచే సుందరు లగుదురు. ప్రేమ నిధి యగుట కతననే భగవానుఁ డింత సుందరుఁ డగుట. మీరుగూడఁ బ్రేమనిధులై యా సౌందర్య సాగరమున బుడకలిడి సుందరులు గండు.

ప్రేమాధారుఁడగు పరమాత్మునుండి ప్రేమ సంచయ మొనరింపుఁడు. ఇటు లొనరించుటచే మీ జీవనములు ధన్యములగును. మీ రంద ఱాపాదమస్తకము ప్రేమాభిషిక్తులు కండు. ఆలోచనలచే, కార్యములచే, వాక్కులచే— సర్వవిధములఁ బ్రేమ ప్రచార మొనరింపుఁడు— ఇటు లొనఁగూర్పుఁడనియే భగవానుని నేఁ బ్రార్థింతును.



ప్రేమ న బాడీ ఊపజై, ప్రేమ న హాట బికాయ ।
రాజా – పరజా జేహి రుచై, సీస దేఇ లై జాయ ॥

— కబీర్

విత్తి – పండించుటకును, సంపత్తి నొసఁగి
కొనుటకును, దుర్లభంబయి తనరు "ప్రేమ"
ప్రజలు – రాజులు – నెవరైన భక్తిమీఱ
శీర్ష మర్పించి యద్దానిఁ జెందఁగలరు.

# ప్రేమశక్తి - తత్సాధన

మూఢమతులగు యువకులు ప్రేమ యను పేరుతో మోహమునకు స్థానమొసంగుచున్నారు, మణిమాల యను భ్రమచే సర్పమును మెడకుఁ జుట్టుకొనుచున్నారు, అమృతమని భావించి విషమును పానమొనరించుచున్నారు, సాగరమని తలఁచి మరుభూములకుఁ బరుగులిడుచున్నారు. ఇందుచే వారిని సావధానులుగా నొనరించు నుద్దేశ్యమునఁ బ్రేమయొక్క లక్షణములఁ గొన్నిఁటి వచించియుంటి. ఇప్పుడు ప్రేమయొక్క సామర్థ్యము నెఱుకఁబఱిచెద —— ప్రేమ సాధనమునకై కొన్ని యుపాయములఁ దెలియఁజెప్పెద.

ప్రేమ శక్తిసముపేతము, సర్వవిజయి. ప్రపంచస్థ సర్వపదార్థములు చేయనోపని కార్యమును బ్రేమ, చేసి చూపఁగలదు. సర్వశక్తులు పరాజయ మొందిన తావునఁ బ్రేమ విజయము నొందఁగలదు. ప్రపంచేతిహాసమును దిలకింపుఁడు; బోధకుఁడు దుష్టబాలకుని సన్మార్గవర్తిగాఁ జేయఁగోరి యెన్నియో యుపాయముల నవలంబించెను;

కాని ప్రయోజనము శూన్యమాయె. తుదకుఁ ప్రేమ దండమును ప్రయోగించినంతనే బాలకుఁడు సన్మార్గగామి యాయె. ఒక వ్యక్తి భయంకర రోగపీడితుఁడై పడియుండెను. శయ్యపై విశ్రమించు శక్తికూడఁ దక్కెను. వైద్యుల యౌషధములన్నియు నిరుపయోగములాయె. ఇంతలో వాని ప్రియుఁడేతెంచెను — శరీరమున విద్యుచ్ఛక్తి ప్రసరించె, శయ్యాశాయి యగు రోగి స్వయముగ లేచి కూర్చుండెను. ప్రేమ దుర్బలుని సబలునిఁ జేయుచున్నది. దుష్టబాలకుని శిష్టబాలకునిగా నొనరించుచున్నది. మహాపాపిని బుణ్యాత్మునిగా మార్చుచున్నది; ఏమిచేయఁజాలదు? స్వీయజీవితముల సంస్మరింపుఁడు — ప్రేమగల ప్రతిప్రదేశమున జయజయధ్వనులు చెలరేఁగుట గాంచఁగలరు.

ప్రేమ సర్వౌషధము — మహౌషధము. స్వర్గమునకు, మర్త్యమునకుఁ బ్రేమయే యాధారము. సురలోకము — నరలోకముఁ బ్రేమసూత్రముచేతనే కూర్పఁబడియున్నవి. ప్రేమకంటె మిన్నయగు శక్తిశాలియగు పదార్థము వేఱొండుకానము. పాషాణహృదయుఁడగు సురాజుద్దౌలా కూడ భక్తవరుఁడగు రామప్రసాదుని ప్రేమగానముచే ద్రవీభూతుఁడైపోయె. నేఁటి రాజరాజేశ్వరుల కనక

కిరీటములుకూడ ప్రేమిసూత్రధారుల చరణతలముల విలుంఠితములగుచున్నవి. నెపోలియన్ బోనాపార్టు సాధింపలేని కార్యమును క్రీస్తుమహనీయుఁ డొనరించి చూపెః కారణము పవిత్రప్రేమాధారుఁడగుటయే. నెపోలియన్ స్వయముగా 'సెంటుహెలనా' యందు దీని నుల్లేఖించి విలపించియుండెను. వానికున్న యనుచర మోహినీశక్తి కూడఁ బ్రేమయొక్క శక్తియే. వారు తమ యనుచరులఁ దనచెంత మంత్రముగ్ధ సర్పముల భాతి వశీభూతులై యుండునటులఁ బ్రేమించుచుండెడివాఁడు. 'ఆరకోలార్' యుద్ధవిజయ మొక ప్రేమకణముయొక్క శక్తి వికాసము మాత్రమే. 'అప్టారలిట్జ' యుద్ధమున వాని ప్రాణముల రక్షించినది ప్రేమయే; హహాహహా నినాద మొనరించుచు నగ్నిమయమగు తుపాకిగుండు వానిమీద కురియుచుండ వాని బాల్యస్నేహితుఁడగు 'జ్యాకోపో' ప్రేమ పరవశుఁడై యాగుండునకుఁ దన వక్షస్థానము నప్పగించి యానందలోకమున నైక్యమొందెః నెపోలియన్ రక్షింపఁబడెను. ప్రేమ యీాదృశ శక్తిశాలిని యగుటకతననే యుత్కృష్టమైనది. ప్రపంచమున నిట్టి ప్రేమకే జయనినాదములు బయల్వెడలుచున్నవి. దీని మహిమ నింతింత యని వర్ణింప నేరివశము ?

ఇకఁ బ్రేమసాధనకై కొన్నియుపాయము లెఱింగించుటకుఁ బ్రయత్నించెద.

౧. ప్రేమస్వరూపుని ప్రేమ సంకీర్తన మొనరించుట, ప్రేమమయులతోఁ బ్రేమవిషయిక సమాలోచనము సల్పుట, ప్రేమిజనజీవితచరితములఁ బఠించుట, రామకృష్ణపరమహంస, గాంధీమహాత్ముఁడు మున్నగు ప్రేమోపాసకులఁ గూడి భగవానుని ప్రేమను గీర్తించుట–ప్రేమసాధనకుఁ బ్రథమకర్తవ్యము. ఈ విధముగఁ బ్రేమనిధులతోఁ బ్రేమసంబంధమై యాలోచించుటచేత, శాక్యసింహ గౌరాంగాది యథార్థప్రేమ వీరుల జీవితచరిత్రలఁ బఠించుటచేతఁ బ్రేమ శూన్యహృదయమునఁ గూడఁ బ్రేమసంచార మారంభించుచున్నది – ప్రేమసంకలితహృదయమున నింకను బ్రేమ యభివృద్ధి నొందుచున్నది. ఆ ప్రేమస్వరూపుని ప్రేమలీలాసంకీర్తనముచేతను — శ్రవణముచేతను, బ్రేమమయులతోఁ బ్రేమాలోచన మొనరించుటచేతను గఠోరవ్యక్తియొక్క హృదయము కూడ నమృతసిక్తమగుచున్నది; దాని నాస్వాదించి నంతనే "ప్రేమ యెచ్చట, ప్రేమ యెచ్చట ?" అని యఱచుచు నున్మత్తుఁడై పోవునటుల వాని హృదయమున నమృతధార ప్రవహించుచున్నది. భగవానుఁడుకూడ

భక్తుని హృదయాలాపము నాలకించి, నేఁడో, రేపో, కొన్నిదినములకో, కొన్ని మాసములకో – ఎప్పుడో యొకప్పు డవశ్యము వానిని ప్రేమరంగమునఁ బ్రవేశ పెట్టుచున్నాఁడు.

౨. ప్రకృతి నిరీక్షణము—జగద్వ్యాప్తమగు ప్రేమ యొక్క విధివికాస చింతనము రెండవ సాధనము. మానవసమాజము ప్రేమభిత్తిపైననే స్థాపింపఁబడి యున్న దని కొంచెము విచారించినంతనే తేటతెల్లమగును. ప్రపంచోన్నతి ననుసరించియే ప్రేమయొక్క మహిమయు విస్తరిలుచున్నది. అమెరికా 'చికాగో' ప్రదర్శనము ప్రేమయొక్క మహోత్సవము. ప్రపంచస్థ సమస్త దేశీయులు, సర్వజాతులు, సచ్చటఁ బరస్పరాలింగన మొనరించుకొని యా ప్రేమస్వరూపుని ప్రేమకేలలచే నేత్రపర్వ మొనరించిరి. అమెరికాలో స్థాపించిన (Parliament of Religion) ధర్మమహాసభ యేమిశిక్ష నొసంగెను? భిన్నభిన్న మతసంగ్రహణముచే బాహ్య వివాదము లెన్ని యుత్పన్నమయినను ధర్మమురొక్క కేంద్రభూమియందు మాత్రము ప్రేమ విరాజిలుచునే యున్నదనికాదా! సమస్తదేశములందుఁ గ్రమాభివృద్ధి నొందుచు జరుగుచున్న వ్యవసాయ వాణిజ్యమంతయుఁ

ప్రేమ ప్రచారమునకుఁ గూడ నెక్కుడు సహకారి యగుచున్నది. "నా యభావమును నీవును, నీ యభావమును నేనును బూర్ణమొనరించుకొందము." ఈ విషయము పరస్పరాభావ విమోచనము నుపదేశించుచున్నది. రాజనైతిక ప్రవృత్తియందుఁ గూడ ననుసంధాన మొనరించినచోఁ బ్రేమకౌతుకమునే విలోకింతుము. ఇంగ్లండు భారతదేశమునుండి యెంతయో గ్రహించెను— భారత దేశము నింగ్లండునుండి యెంతయో గ్రహించెను. ఈ రీతి సమస్త ప్రపంచము ప్రేమసూత్రమున బంధింపఁ బడి యున్నది.

కొంచెము లోఁతునకుదిగి పరికించినచో ప్రత్యాధ్యాత్మిక తత్త్వాన్వేషణమునందును వర్ణనాతీతములగు ప్రేమలీల లెన్నియో కాన్పించును.

ప్రకృతి నిరీక్షణ మత్యంత ప్రేమోద్దీపకమైనది. చంద్రుఁడు, సూర్యుఁడు, జలము, వాయువు, వృక్షములు, లతలు,— సమస్తము ప్రేమస్వరూపుని యాదేశపాలన మొనరించుచు మన కెవ్విధి సుఖ మొనఁగూర్చుచున్నవో విచారించినచో హృదయమునఁ బ్రేమసంచార మారంభమగును. ఓ ప్రేమభిక్షుకులారా! కొన్నిదినములు చంద్రదేవుని ధ్యానపూర్వకముగా నిరీక్షింపుఁడు; మీ హృద

యము లెటుల రససంపూర్ణము లగునో కాంచెదరుగాక. ప్రకృతియొక్క సుందర సుందర దృశ్యములం దిలకింపుఁడు, నదియొక్క కలకలారావము నాలకింపుఁడు, మలయమారుత సేవన మొనరింపుఁడు, పుష్పవిలసనము విలోకింపుఁడు, అత్యంత మధుర వర్షబిందువుల గంభీరానంద మనుభవింపుఁడు — హృదయమునఁ బ్రేమ యుత్పన్న మగును. ప్రకృతియొక్క మనోహరమూర్తిని జూచినంతనే ప్రాణములు ప్రేమప్రపూర్ణములై పోవుచున్నవి.

"జ్ఞప్తి కెలయించెఁ బ్రియు — సుమసౌరభంబు"

ప్రేమ శూన్యునకుఁ గూడ నవీన ప్రేమోద్రేకము కల్గుచున్నది. ప్రేమమయుఁడగు ప్రకృతియొక్క చెంత నిలిచినంతనే యది హృదయమును బ్రేమరసముచే నింపివైచుచున్నది. కాన నలువైపుల నలముకొనిన యగణ్య మనోహర దృశ్యవిలోకనముచే స్వీయప్రాణములకు సుఖశాంతు లొనఁగూర్పుఁడు. మీ ప్రేమపాత్రు లెవరైనఁ గలరేని వారితోఁ గూడఁ బ్రకృతి నిరీక్షణ మొనరింపుఁడు. ఈ రీతి నాచరించినచో ద్విగుణానందము కల్గును; ప్రేమ క్రమాభివృద్ధి నొందును. ప్రేమాస్పదుని కంఠాలింగన మొనరించుకొని యెంతగాఁ బ్రకృతి నిరీక్షణ

మొనరింతురో యంతమాత్రమే మీ యిరువుర హృద యములఁ బ్రేమ యభివృద్ధిఁ జెందును. ప్రేమ యభివృద్ధి నొందినకొలఁది, సూర్యతేజమును, చంద్రమధురిమను, పుష్పకోమలమును, సాగర గాంభీర్యమును — సంచయ మొనరించుకొనఁగలరు. ఇటులఁ బ్రకృతి విపినములగు విధి శృంఖలత్వమును, శాసనమును విలోకించి యిరువురుఁ దమ తమ జీవితములయందు వానిని సమన్వయ మొన రించుకొని దివ్యధామమున కధికారులై తేజరిలఁగలరు.

3. ప్రియసహితుఁడవై కర్తవ్యసాధనమునకు ముందంజ వేయుము. ఇరువురుఁ గలసి కర్తవ్యసాధనమున కెంత ప్రయత్నింతురో యంతమాత్రమే కర్తవ్యతా మధురిమ నాస్వాదింపఁ గలరు. కర్తవ్యజ్ఞానమును నష్టమొనరించు ప్రేమ ప్రేమకాదనియు — మోహమనియు నిదివఱకే వచించియుంటి.

ప్రేమాస్పదుని దర్శనముచేఁ జిత్తమున, నేకాగ్రత యుత్పన్నమగుచున్నది; కర్తవ్యసాధనమున మనోయోగ మభివృద్ధిఁ జెందుచున్నది. పాతంజలి చిత్తైకాగ్రతా సాధన సంబంధమై యిట్లు వచించె —"యథాభిమతధ్యా నాద్వా." ప్రియధ్యానముచేఁ జిత్తమేకాగ్రత నొందు చున్నది. చంద్రుని బరీక్షించినంతనే చిత్తమేకాగ్రతఁ

జెందుచున్నది. ప్రేమించు పదార్థమును దిలకించినంతనే చిత్తచాంచల్యము దూరమైపోవుచున్నది. ప్రేమాస్పదుని విలోకించినంతనే యింద్రియములు చలించినచో, చిత్తమున విక్షేప ముత్పన్నమయినచో నా ప్రేమ ప్రేమ కాదు — అది సర్వనాశన మొనరించు కామమో లేక మోహమో. ఈదృశప్రేమనుండి సర్వదా విముక్తులు కండు.

ప్రేమియు, ప్రేమాస్పదుఁడును — ఇరువురుఁ గలసి స్వీయకర్తవ్యసాధనమున నియుక్తులయినచోఁ గర్తవ్యము సుచారురూపమునఁ బ్రత్యక్షమగును. మఱియుఁ బరస్పర దర్శనమునను, స్మృతిసుఖమువలనను గర్తవ్యసాధనమున నత్యంతానుకూలత హృదయంగమ మగుటచే నిరువుర ప్రేమయు ఘనిష్ఠతరమగుచున్నది. కర్తవ్యపాలనమున సాహాయ్యపడినవాఁడు మన కవశ్యము ప్రియుఁడగుచున్నాఁడు; కర్తవ్యపాలనాసక్తుఁడై యున్నవానిఁగూడఁ బ్రేమింపకుండఁజాలము. ఇందుచేఁ బ్రేమియుఁ బ్రేమాస్పదుఁడును— ఇరువురును స్వీయకర్తవ్యసాధనయందు నొండొరులు సాహాయ్యపడి, యిరువురును వారి కర్తవ్యనిష్ఠను లెస్సగా గ్రహించి పరస్పరము ప్రియతములై నెగడుచున్నారు.

౪. పరస్పర జీవితపరీక్ష నొనరించుకొనుటచేఁ బ్రేమ యభివృద్ధిఁ జెందుచున్నది. ఆత్మపరీక్షవలన స్వీయహృదయమును నిర్మలమొనరించుకొనుటులనే, ప్రియుని జీవనమునుగూడఁ బరీక్షించి దాని నిర్మలమునుగాఁ జేయఁగలము. ప్రథమము మీ యొక్కయు మీ ప్రియులయొక్కయుఁ బ్రేమ నొరగల్లుపై రాపిడివెట్టి పరీక్షింపుఁడు. నేఁ జెప్పిన ప్రేమ లక్షణము లన్నియు దానితో సమన్వయమగుచున్నవో లేవో గ్రహింపుఁడు. తల్లప్రేమ భాసనము దానియందుఁ బొందఁగల్గినచోఁ గాంచనము పరిశుద్ధమైనదని భావింపుఁడు. లేనిచో నట్టి ప్రేమకు దూరముగాఁ దొలఁగియుండుఁడు.

ప్రేమ యమృతమయము; కాని విషసంకలితమైనచోఁ బ్రాణఘాతుక మగుచున్నది. జలములేక మన ప్రాణములు నిలువఁజాలవు; కాని యా జలమే విషాక్తమగుచో విషూచి వ్యాపించును. విషాక్తప్రేమ సైతానుయొక్క ప్రధానాస్త్రము. ఇట్టి ప్రేమకు గుఱియగుటవలనఁ బ్రపంచమునఁ బిశాచ మనేక జీవుల సంహరించియున్నది. ప్రతి స్థలమున వారి యస్థిస్తూపములు గాన్పించుచున్నవి. జాగ్రత్త! ఆ నిర్జీవములగు నస్థిరాసులు కాన్పించు తావులకేగవలదు. పరస్పరము ప్రేమ పరీక్షకుఁ గడంగి తదుపరి

జీవితపరీక్ష నారంభింపుఁడు. ప్రియుని జీవితమున నెట్టి గుణములు గలవో, యెట్టి దోషములుగలవో — సర్వము ను సూక్ష్మాతిసూక్ష్మముగఁ బరీక్షింపుఁడు. ఇటులఁ బరీక్షించుటయే ప్రేమియొక్క ధర్మము. మఱియుఁ బ్రేమయందే యిట్టి పరీక్షకుఁ జమత్కార పూర్ణ సుయోగము లభించుచున్నది. ప్రేమాస్పదుఁడు తన ప్రేమియెదుట హృదయమును బహిర్గత మొనరింపక యుండఁజాలఁడు. ప్రేమగల తావుననే హృదయబహిర్గత వ్యాపారము కలదు. ప్రేమిచెంతఁ బ్రేమాస్పదుని యంత ర్బాహ్యములు సమస్తము బహిర్గతమై యుండును. పరస్పరము హృదయముల బహిర్గత మొనరించుకొననిచో నటఁ బ్రేమ వసింపఁ జాలదు. ప్రియుఁడు ప్రేమియొక్క సమీపమునఁ దన హృదయకుహరమున నే మూల నే మున్నదో— అది మంచియో, చెడ్డయో, గ్రహింపఁ గోరి దానినంతటిని బహిర్గత మొనరించి చూపు చున్నాఁడు. — ప్రేమియొక్క హృదయాభాసముచేఁ దన యంతర్బాహ్యముల నిర్మల మొనరించుకొనుచున్నాఁడు. దీనియందుఁగల యానందము ప్రపంచమునందలి యితర వస్తువులఁ గానము. కమలము సూర్యోదయమగుటచే వికసించుచున్నదని మీరు వచించుచున్నారు; కాని

కమలము తన హృదయమును బహిరంగపఱిచి తన ప్రియతముఁడగు సూర్యునికిఁ దన యంతరతమ ప్రదేశమును జూపుచున్నదనియు, వారి కిరణములచేఁ దన యంతస్థ్సలమును బ్రకాశింపఁజేసి దళములను వ్యాపింపఁ జేయుచున్నదనియు నా భావన. కుముదము చంద్ర విలోకనముచే వికసించుచున్నదనఁగాఁ దన హృదయాంతస్స్థలమును వానిచెంత వెలిపుచ్చి మూలమూలలకుఁ జంద్రకాంతిని బ్రసరింపఁజేసికొనుచున్నది. ఈ రీతిఁ బ్రాణముల వెలిపుచ్చి తన ప్రేమపాత్రుని శుభకిరణములచేఁ జిత్తమును రంజింపఁజేసికొనుట కెవఁడాకాంక్షింపఁడు? తోడనే పరస్పర ప్రాణముల బహిరంగపఱిచి యొండొరులు సమీపవర్తులగుటచే జీవితపరీక్షకు నత్యుత్తమమగు సదవకాశము లభించుచున్నది. ఈ సదవకాశమును నిరుపయోగ మొనరించుకొనక గుణదోషగ్రహణమునకు నుద్యుక్తులగుట యెల్లర కర్తవ్యము. ప్రేమాస్పదుని జీవితమును (Analysis) వ్యాస మొనరింపుఁడు. అత్యంత తీక్ష్ణదృష్టిని సారించి వారి జీవితము లే యే యుపాదానములచే సుఘటితములై యున్నవో, యా జీవితముల నెట్టి గుణదోషములు పొడసూపుచున్నవో వాని నన్నిఁటి గ్రహింపుఁడు — లెస్సగా విమర్శించి విశదీకరించు

కొనుఁడు. తిరిగి వాని నన్నిటి సమ్మిశ్రిత మొనరించి దోషముల నాశనముఁజేసి గుణముల నభివృద్ధి నొందించి ప్రేమాస్పదుల జీవితచరిత్రల సంఘట్టన మొనరింపుఁడు. ప్రియధ్యానమే వ్యష్టిసమష్టి వ్యాపారము. వ్యాస సమాసములచేతనే జ్ఞాన మభివృద్ధిఁ జెందుచున్నది. ఏ విజ్ఞాన మెవఁ డభ్యసించినను నందు వ్యష్టి సమష్టివాదమే కానన గును. ఆధ్యాత్మిక విజ్ఞానము, మనోవిజ్ఞానము, ప్రాకృతిక విజ్ఞానము, సర్వమ్మును వ్యష్టిసమష్టులపైనఁ గేవలము (Analysis and synthesis) ల పైన నవలంబితములై యున్నవి. ఇందుచే జ్ఞానాభివృద్ధి, జ్ఞానవికాసముఁ జేకూరుచున్నవి. ప్రేమి యెవనిపై ననురక్తుఁడై యుండునో వాని వ్యష్టిసమష్టుల గ్రహించి వ్యాకులత నొందించుచున్నాఁడు. ఈ విషయము నెఱింగియే 'ఇమర్సన్' కవివరుఁడు — Love sharpens intellect (ప్రేమ బుద్ధిని దీక్ష్ణ మొనరించుచున్నది) అని వచించె. నీ ప్రియుని చరిత్రను సూక్ష్మదృష్టితో విమర్శింపుము.

ప్రేమ గ్రుడ్డిదని కొందఱు వచింతురు. ప్రేమ యెప్పుడును గ్రుడ్డిదికాదు; కామమోహములు గ్రుడ్డివి — ప్రేమ చక్షుష్మంతమే. విశ్వచక్షువును, సర్వద్రష్టయు నగు భగవానుఁడు ప్రేమస్వరూపుఁడు. ప్రేమ తీవ్ర

దృష్టితోఁ బ్రేమాస్పదుని యంతస్థ్సలమును విలోకించు చున్నది. ఇటులఁ బరికించుటచేఁ బ్రేమ తఱిగిపోవునని శంకింప నవకాశములేదు - ప్రియునియందేమైన దోషమును గాంచినంతనే దాని దూరమొసరించుటకై ప్రేమి యొక్క ప్రాణములు తల్లడిలసాఁగును - ఇందువలనే ప్రేమ యభివృద్ధిఁ జెందుచున్నది. ప్రేమి ప్రియునిఁ గౌగిటఁ జేర్చుకొని యిటుల వచించును - "నేను నీయం దెట్టి కళంకమును జూడఁజాలనంతటి యాదరపాత్రుఁడవు కమ్ము, వెంటనే నీవు దోషముల దూరమొసరించుకొనుము." ప్రేమి యనురోధము ప్రియునకు వేదవాక్యము. వినినంతనే వాఁడా యనురోధమును గార్యరూపమునఁ బరిణమింపఁ జేయుటకు నుద్యుక్తుఁడగుచున్నాఁడు. ప్రేమి కూడ దీనియందు వానికి సాహాయ్యమొసఁగుచున్నాఁడు. ఇరువురి ప్రయత్నమును విలోకించి స్వర్గమునుండి ప్రేమ స్వరూపుఁ డాశీర్వదించుచున్నాఁడు - ఈ విధముగఁ గళంక మతిశీఘ్రముననే రూపుమాయుచున్నది. అనురోధ రక్షణముచేతనే కళంకము మఱుఁగువడుచున్నది. ప్రేమ తరంగమురీతి నభివృద్ధినొందును. "నా ప్రేమియొక్క హార్దికప్రేమకుఁ బాత్రుఁడనగుటకై నాసమస్తకళంకమును రూపుమాపవలెను" - ఇటుల విచారించినచో మనుష్యుఁ

డతి నిర్మలుఁడై నెగడుచున్నాఁడు; ప్రేమకూడ నభివృద్ధిఁ గాంచుచున్నది. హృదయకుహరమున నెచ్చటనో మఱుఁగుపడియుండిన మచ్చను మన మాత్మపరీక్షచే గ్రహింపఁజాలక పోయినను, మన ప్రియుఁడు దాని నెఱింగి దూరమొనరించుటకూడ సంభవిలుచున్నది. నేను స్వయముగఁ జేయనోపని కార్యమునే నా ప్రియుఁడు చేసిచూపెను. ప్రేమాస్పదుఁ డెంతయు మనోహరుఁడు–మధురమయుఁడు. నేను నా శరీరమునందలి యనేక స్థలముల స్వయముగ నిరీక్షింపఁ జాలనైతి; కాని వారు నిరీక్షించుచున్నారు. నా చరిత్ర ఘటన లనేకములు మదీయదృష్టి కగోచరములైనను వారు సమస్తఘటనల విలోకించుచున్నారు; ఇందుచే వారు నాకు నాకంటె నెక్కుడాత్మీయులు – వారిని నేను బ్రాణములకంటె నెక్కుడు ప్రేమింపక మఱెవరిఁ బ్రేమింతును ?

౫. నిర్జనస్థలమున విశ్రమించి ప్రేమాస్పదుని ధ్యానించుట విశేషోపయోగము. దేనిని ధ్యానింతురు ? వారి ముక్కు, చెవులు, నోరు, చర్మమునా ? నేను వానిఁ బరిత్యజింపుఁడని నుడువుటలేదు; కాని ప్రేమాస్పదుని, శమము, దమము, దక్షత, ధీశక్తి, దయ, ఆధ్యాత్మికము మొదలగు గుణసమూహామే ధ్యానముయొక్క

ప్రధానవిషయము. ఈ రీతి ధ్యానించుటచేఁ బ్రేమ యత్యంతోన్నతిఁ జెందుచున్నది. కర్ణనాసికాద్యవయవ ముల విసర్జించి యాత్మనే పరిగ్రహింపఁ గోరినచో వారితో మధ్యమధ్య విడివడుచుంటయే యుత్తమ సాధ నము. బాహ్యసాంగత్యము నప్పుడపుడు నాపియుంచుట యాత్మానుసంధానమున కెంతయుఁ బ్రయోజనకారి. ఇందువలననే 'ఎమర్సన్' యిటుల వచించె – "Leave this touching and clawing" ఆత్మతోఁ జిత్తము నైక్యమొనరింపుఁడు. క్రీస్తుకొఱకై యెందఱో త్యాగ ధనులు ప్రాణవిసర్జన మొనరించిరి. వారలు వాని మూర్తిని జూచియే యెఱుంగరు. ఆత్మకై యాత్మతోఁ బ్రేమించిరి. 'బైరన్' అనువానిఁ జూడకపోయినను వాని కొఱకై ప్రాణము లొసంగ నుద్యుక్తురాలయిన నారీ మణి కథనొండు 'వాషింగ్టన్ ఇర్విన్' అనువాఁడు లిఖించెను.

౭. ఇఁక నుపసంహారవాక్యముల నుడివెద – భగవాను నుపాసించు సమయమునఁ బ్రేమాస్పదుని వక్షస్థలము ననే యిడుకొనుఁడు. ప్రేమాస్పదుఁడు దూరవర్తి యగుచో భగవానుని చరణతలమున వారిమూర్తిని బాదుకొల్పి యా(శ్రీ)చరణములయందు వారి యాత్మను

నంజలి యొసంగుఁడు - అప్పు డెంతసుఖము - ఎంత యానందము, ప్రాప్తించునో గ్రహింపఁగలరు. మీరు ప్రేమించువారి యాత్మల నన్నిటి మాలగాఁ గూర్చి వారి చరణములకు నుపహార మొసంగుఁడు - దానియం దమృతముత్పన్నమగుట విలోకింపఁగలరు. మీ ప్రియుల విషయమై నుడువవలసిన నుడులన్నియు వారి చరణతల మున నివేదింపుఁడు; ఉభయులకు మేలొదవును. ఏనాఁడు మీరు సమస్త ప్రపంచమును 'నాది' యని వచించి వారి కమలచరణములయం దంజలి యొసంగఁగలరో, యానాఁడే మీరు "ప్రేమస్వరూపుని కుపయుక్తసంతా నము" అని చెప్పి మీ పరిచయ మొసంగఁగలరు - ఆనాఁడే మిమ్ము దేవగణములు ప్రేమసింహాసనమున విశ్రమింపఁజేసి ప్రేమహారతి నొసంగుదురు-నలుదిక్కులు మధుమయములై పోవును. యథార్థముగ నానాఁడే మీ సమీపమున మృత్యులోకము స్వర్గలోకముగఁ బరిణ మించును.

ఓ దేశాభిమానులారా! కామ మోహములు దేశము నాక్రమించినవి. ఇందువలననే మీయెదుట నేను ప్రేమయొక్క యున్నతాదర్శముల నేకరువుఁబెట్టితి. మీర లా యాదర్శముల ననుగమించుచుఁ బ్రేమను

సాధింపుఁడు - మీకుఁ గళ్యాణమొదవును; దేశము సురక్షితమగును. విద్యాలయ స్థాపనోద్దేశ్యము సఫలమగును; మీ బోధకులకు, మీ యభిభావులకు సంతసము కల్గును, స్వర్గధామమునుండి పుష్పవృష్టి వర్షించును, తిరిగి సుదినము లేతెంచును. భగవానుఁడు మిమ్ము నాశీర్వదించుఁ గాత !

స ం పూ ర్ణ ము

*

Love is not getting, but giving; not a wild dream of pleasure and a madness of desire – oh, no, love is not that. It is goodness and peace and pure living; yes, love is that; and it is the best thing in the world and the thing that lives longest.

—*Henry Van Doycan.*

భారతీ ప్రెస్, తెనాలి. 1956.